శ్రీః

# కల్యాణలీల

371

శృంగగిరి శ్రీ విరూపాక్ష శ్రీ పీఠాధీశ్వర శ్రీ విద్యాశంకరపదమావేశ
ప్రకాశిత జగద్గురు శ్రీ కల్యాణానంద భారతీమాంతాచార్య మహా
స్వామి చరితకుసుమము జగద్గురు షష్టిపూర్తిమహోత్సవ
సమయమున గురుచరణసరసిజములందు
సమర్పింపఁబడియె.

రచయిత:
ఓరుగంటి నీలకంఠశాస్త్రి

ప్రకాశకులు:
లక్ష్మీగ్రంథప్రచారిణి, తెనాలి.
1942

 [వెల రు. 0—10—0



శ్రీ విద్యాశంకర పదమాఒఒవేశ ప్రకాశిత

జగద్గురు

శ్రీ కల్యాణానందభారతీ మాంతాచార్య స్వాములవారు

శ్రీః

శ్రీ గురుభ్యో నమః

# ప్రస్తావన

శ్రీకృష్ణద్వైపాయనమహర్షి కలిద్వాపరసంధియందు ఆమ్నాయార్ణవమును తమధిషణామందరమున మథియించి కర్మోపాసనాజ్ఞానరూపంబగు త్రివిధ కైవల్యసోపాన పరంపరామృతమును ఆయత్తముచేసి లోకమునకు అనుగ్రహించుటకు నల్వురు శిష్యులకు ఒప్పగించెను. ఆ నల్వురు శిష్యులును వారివారి మార్గంబులను ఆచార్యోక్తప్రకారంబునఁ బ్రవర్తింపఁజేయుచుండిరి.

కాలక్రమమున అట్టి యారోహణత్రయమునందు నిశ్శ్రేయసపదప్రాప్తికి సాక్షాత్సోపానంబగు జ్ఞానమున ననేకంబులగు విప్రతిపత్తులు వెడలినవి. ఒకదిశఁ బాంచరాత్ర పాశుపతాగమంబులు తమతమ యవైదిక మార్గంబులను బ్రతిష్ఠింప నెంచుటచే సులభంబులగు నా రీతులఁ గురియ పురుషార్థంబు అనాయాసంబుగనే కైకొనవచ్చుఁగదా యని జనులు ఆసపడఁజొచ్చిరి. వేఱొకదెస అహింసాసిద్ధాంతమును బ్రచురించుచు సప్తతంతు సంతానంబులందలి పరంపరాకంబులను ఆధారముగాఁ గైకొని వైదికమార్గ మూలచ్ఛేదంబులను ఒనరింప నెంచు సౌగతుల కైవల్యసిద్ధాంతములు జనుల మానసిక వీథీ విహారములఁ జేయ మొదలిడినవి. ఆ కాలమున దేశమునందు అంతటను అవైదిక పాషండమతములును కతిపయ యుక్తిమాత్రసిద్ధ సౌగతసిద్ధాంతములును గాఢాంధ తమసంబులవలె నలుగడల నాక్రమించుచుండ వేదాంతసమ్మత మతము ఏకడనో గౌడపాదకారికా జ్యోతుల వెలుఁగుచుండెనే కాని ఆ తమో విచ్ఛిత్తికి అవ్వి యెంతమాత్రము చాలినది కాకుండెను. అట్టి సమయాన శ్రీ విద్యాశంకరగురుఁడు ఉదయించి తన ప్రచండ గభస్తిసహస్రంబులచే ఆధ్వాంతమును అపనోదింపనెంచెను. కావున నాతఁడు జ్ఞానావాప్తికిఁ బరమప్రమాణములుగా చెన్నుఁబడి విప్రతిపత్తి సహస్రంబులకు ఆలవాలమగు ప్రస్థానత్రయంబునకు యథార్థంబగు సంప్రదాయ సిద్ధార్థంబును విపులంబుగ లోకము

నకు బోధింపనెంచి అయ్యైవానికి సహస్ర శ్రుతిప్రమాణానుప్రాణితంబులగు వ్యాఖ్యానరాజంబులను అనుగ్రహించిరి. తత్కాలంగల స్తోత్రాదికములును ఉపాసనా విషయంబులును కించిత్తుగాఁ బ్రకటితంబు లైనను అయ్యవి ఆనుషంగికములే యగుటచే వీరియుగము వేదాస్తిత్వ ప్రతిపాదకయుగ మని పేర్కొనవచ్చును

నాఁటినుండియుఁ గొంతవఱకు శ్రుతిప్రమాణతత్పరులందఱును అసతో భయులై స్వస్వధర్మానుసారులు కాఁగా సౌగత పాషండ మతానుయాయులు సంపూర్ణముగఁ గాందిశీకులై దిక్కోణంబులను బట్టసాగిరి.

చక్రనేమి క్రమమునఁ గాలస్థితి యెల్లపుడు పరిభ్రమించుచుండుటచేఁ గొన్ని శతాబ్దులు ఇట్లు సక్రమముగఁ గడచినను ఏనాఁడు భారతదేశము నందలి రాజన్యులందఱును దమలోఁదాము కలహించుచు భోగమాత్రాసక్తులై పౌరుషము చచ్చి గేహేశూరులై యుండిరో అనాఁడు సకల సంపత్సమృద్ధ యగు భారతమాత మ్లేచ్ఛుల పాలకు గుఱియయ్యెను. క్రమముగాఁ బహ్యతో హారులగు నా మ్లేచ్ఛులే పవిత్రతమంబగు భారతభూమికి అధిపతులై భారత నాగరికతా సౌభాగ్యమును నాశనము గావించిరి. వైదికమతమునకు అజన్మ ద్వేషులగువారు మన యాచారంబుల నాశనంబు గావించిరని వేఱెఁ జెప్ప నక్కఱలేదు. భారతీయులలో అగ్రవర్ణములవారందఱును గొందఱు అటవీ మాత్ర శరణ్యులయ్యు, వేఱొక కొందఱు మ్లేచ్ఛభూజానుల మతానుయాయు లయ్యు, నెట్లో విషకృమిన్యాయమునఁ గాలము గడుపఁజొచ్చిరి. అట్టితఱిఁ జావనిభారతీయత్వము మనములందు బాధింపఁ గొందఱు భారతభూమియందుఁ బ్రమాణరాజములుగా నలరారు శ్రుత్యాదులనే యెట్లో యొకవిధమునఁ బ్రమాణభావముతోఁ దలంపసమకట్టుచుఁ దమ జీవగఱ్ఱలగు మ్లేచ్ఛులయాగ్రహ పాత్రులు గాకుండ వారికిఁ గూడ ఇష్టమగునట్టి కొన్ని సిద్ధాంతములతో మతములను వెలయించిరి. ఇట్టి మతములు భారతీయత్వమునకు మ్లేచ్ఛానుగ్రహమునకునుగూడ ఎంతమాత్రము హానికలుగఁజేయవను తలంపుతో ఆనాఁటి జనసామాన్యము దానియందుఁ దలయొగ్గ నారంభించెను. కాని ఏతాదృశ మతవిజృంభణమున సత్యంబగు వైదికమతము నాశనమునొందునేమోయని

భీతులై మ్లేచ్ఛప్రాతిగంధాఘ్రాణవిగ్రులగు కొందఱు ఉత్తమవైదికాభిరుచులు తెగువసేసి అక్కాలమునఁ బ్రతీపులుగా సంచరించి వైమతములను అస్తుంకరింపక నానిలోని యాథార్థ్యమును జిజ్ఞాసువులకుఁ బ్రకటించుచుండిరి. కావున దృఢవైదికమతదీక్షితులు సత్యానృతంబులు గ్రహియించి ప్రత్నప్రకల్పితంబులగు మతంబులు దూరీకరింపఁదగినవని తలంచి వైదికమార్గానుయాయులై యొప్పుచుండిరి.

ఇట్టి సంకులమత సమయములతోనొప్పు గస్థకాలమునందు విద్యారణ్య భారతీంద్రుఁడు ఉదయించెను. ఈతఁడు సక్రమంబుగ సకల వేదశాస్త్రములను అధ్యయనము చేసిన వెనుక నూతనమత నిదానులు తమ మతప్రాశస్త్యమునకై వేదము ఆత్మమతోపష్టంభక మనుటను గొన్ని యపూర్వార్థములను అర్థానికిఁ గల్పించుటచే సంప్రదాయసిద్ధార్థము మఱుఁగు వడినదని తలఁచి తాను స్వయముగాఁ జతుర్వేదములకు విపులమగు వివరణమును జేయనెంచెను. దానికిఁదోడు వైదికమతరక్షకమగు సామ్రాజ్యమును స్థాపింపఁదలఁచి అర్థానిని బుక్కభూపాలుని సహాయ్యమున నెరవేర్చి ఆతనికి ఆచార్యుఁడును మంత్రియునై వేదార్థంబులను ఉద్ధరించియు ఉపనిషదర్థంబులు శ్రీవిద్యాశంకరునిచే నిరూపిత పూర్వాంగములగుటచేఁ గర్మకాండమునే ప్రధానముగఁ జేకొని విపులంబులగు గ్రంథంబుల రచియించి షడంగములందును శారీరమునందును ప్రౌఢగ్రంథంబులను వెలయించి త్రికగణాగదంకారుఁడై యొప్పెను. ఈ మహాభాగుఁడు వాఙ్మయమునందేగాక మ్లేచ్ఛాదుల బారినుండి తప్పించి రాజకీయమునందును దేశమునకు మిగుల స్వాతంత్ర్యమును సంపాదించెను. ఏదియెటులున్నను ప్రధానముగ నీతఁడు సర్వవ్యాఖ్యా నిగమనపూర్వకంబుగఁ గర్మకాండార్థ ప్రతిపాదకంబులగు వేదభాష్యంబులఁ గావించుటచే ఈతని కాలము కర్మకాండార్థ ప్రతిపాదకయుగ మని చెప్పవచ్చును.

ఇట్లు విద్యారణ్య భారతీంద్రులచే నెలకొలుపఁబడిన ధర్మవ్యవస్థ అప్రతిహతముగ నేఁటివఱకు వేదభాష్యాది గ్రంథపఠనమునఁ జేసి, వైదికావతంసుల యాచారానుష్ఠానంబుల చేత, వెలుఁగొందుచునే ఉండెను. ఆనాఁడు శ్రీ విద్యాశంకరునిచే ఉత్తేజితంబగు జ్ఞానఘంటాపథంబు పోలె ఈనాఁడు

విద్యారణ్య భారతీ యతిసార్వభౌమునిచే వ్యవస్థాపితంబగు కర్మకాండ సంస రణముగూడ వైదికపుంగవులు విహరించుటకు విశాలమై ఒప్పుచుండెను.

కాని జ్ఞానకర్మంబులకు మధ్యపాతియగుచుఁ గర్మఠులను జ్ఞానసౌధం బులకుఁ గొనిపోవు నుపాసనసరణి విద్యారణ్య భారతీంద్రులకాలమున సద్యో గాచరణమును ఒందుటచేఁ గాఁబోలు అద్దానిని సవరింప నాతినికి అవసరము లేకపోయినది. క్రమముగాఁ గాలవశమున అగ్రవర్ణముల వారలకు అధమ వర్ణములవారితో అన్యోన్యవ్యవహారములు సన్నిహితములగుడు ఈ యుపాస నయంతయుఁ గాపథమునొందనారంభించెను. విప్రులకు హేయంబగు కౌళాచారము విప్రులచేఁగూడ ఆశ్రయింపఁబడుచుండెను. ఉపాసకుల యప త్యంబులు పూజావిషయంబులెట్లున్నను జనకులయొద్ద నిర్భీతులై స్వేచ్ఛతో మపంచకమునకు అలవడి చిరోపార్జితంబులగు మడిమాన్యంబులను తెగనమ్మఁ జొచ్చిరి. తుదకు ధర్మభోగమునకై పవిత్రతమములుగ నెలకొలుపఁబడిన పీఠస్థానములు సైతము కౌళాచారపూరితంబులై వైదిక ధర్మంబులను దగ్ధము లుగాఁ జేయమొదలిడినవి. ఇది యిట్లుండఁ బండితులు తామెద్దియో యొక్క మంత్రసిద్ధివడసి పరస్పరమత్సరగ్రస్తులై ఒకరిపై నొకరు మంత్రప్రయోగములను జేసికొని క్రోధశాంతి యొనర్చుకొనుచుండిరేకాని వేఱొండుఫలమును ఒంద లేకపోవుచుండిరి. ఉపాసన యందు విశ్వాసము లోకమునఁ బెచ్చుపెరిగిన కొలఁది కొందఱు వేదశాస్త్రాధ్యయనము గావింపకయే ఇట్టి మంత్రోపాస నమువలన జీవిక గడుపనెంచి ఎట్లో యొకగురువునాశ్రయించి ఏదియో యొకమంత్రమును జెప్పుకొని నామమాత్ర మంత్రోపాసనాను జీవులుగ బయ ల్వెడలిరి. ఇట్టివారికి సామాన్యజనులవలనఁ గలుగు పూజ్యతనుగాంచి జీవికా సాధనంబులలో నియ్యది అనాయాససాధ్యమని యెంచి అకించనులందఱును దీనినాశ్రయింపఁ దొడఁగిరి.

"సదా జప పటాహస్తే మధ్యేమధ్యే ఽక్షిమీలనమ్ ।
ఆమధ్యాహ్నం నదీవాసః సమాజే దేవతార్చనమ్ ।

సతతం శుచివేషశ్చ" యను దాంబికలక్షణము ఇట్టివారిచేఁ దమ ప్రాశ స్త్యమునకై ఆశ్రయింపఁబడుచుండెను. ఉపాసనా విధమంతయు జ్ఞానమును

వదలి తత్ప్రీతినిధిగా వసుసంచయముపై బ్రాలఁజొచ్చెను. ఉదుంబర గర్భు లందఱు మాంత్రికోత్తములు కాఁదొడఁగిరి. తుదకు—

"యావదజ్ఞానతో వానమాచారో వా విలక్షణః।
తావన్మాహాత్మ్యరూపేణ వర్త్యవస్యతి మాన్త్రికే।
యది నక్వాపి విద్యాయాం సర్వత్రక్రమతేమతిః।
మాన్త్రికాస్తు భవిష్యామః"

అను మొదలగు నవహాసములను నిందలకును ఉపాసకులు గుఱియగుచుండిరి. ఆహా! ఉపాసనము గతి ఎట్లుపట్టినది. కైవల్యైక సాధనంబని పరమేశ్వరునిచే నిశ్చ్రపంచంబగు నీయుపాసనాపద్ధతి ఈపాత్రే సమితులగు కుక్షింభరులచే ఎట్టిమార్గమున కీడ్వఁబడినది! కావుననే మంత్రోపాసకులనఁగా పిశాచోచ్చాటనము చేయువారనియు మారణప్రక్రియలను ఒనర్చి కసి తీర్చుకొనువారనియు లోకమున విశ్వసింపఁబడుచున్నది.

ఇట్లు జ్ఞానమునకు అసాధారణ సాధనంబగు నుపాసనాసరణికి గ్లాని సంభవించుచున్న విషాదసమయమున భారతీంద్రులు సకలలోకకల్యాణమును సమకూర్ప మూర్తిదాల్చిన పారమేశ్వరానుగ్రహమో యనునట్లు వెలసిరి. చిఱుతప్రాయముననే సత్సంప్రదాయమునఁ బూర్ణదీక్ష నొంది ఆచార్య పాదులనుండి ఉపాసన రహస్యంబులను సక్రమంబున మన భారతీంద్రులు గ్రహించిరి. ఉభయవిధ సంప్రదాయములను దెల్పు నుపాసన గ్రంథముల నన్నిటిని ఆమూలాగ్రముగఁ దమ నైజమగు వివేచనప్రతిభతోఁ బరిశీలించి తమ భారతదేశ దిగ్విజయ సమయమున ఆయాయి సంప్రదాయ విచక్షణులవలనఁ దత్తదాచారముల నన్నింటిని గృత్స్నముగ అవగాహనముచేసికొనిరి. వెంటనే దేశమునఁగల్గు నిరోమపద్రవములు గాంచి విచారపడి తా మెట్లైనను ఈ మఱుఁగువడిన దక్షిణాచారము నుద్ధరించి సరియగు నుపాసనాపద్ధతిని, అద్దానికి శిష్టులచే ఆదియందు ఉద్దిష్టమైన యుపాసనప్రయోజనమును బునః ప్రతిష్ఠితములుగాఁజేయ దృఢతరముగ సంకల్పించిరి.

అనంతరము తమ బోధలచే లోకమున ఉపాసనమునందు ఆసక్తిగల్గించి అట్టి యుపాసనాసక్తులగు చాతుర్వర్ణ్యంబులవారికిని ఆయావర్ణంబునకుఁ

దగునట్లు యథాశాస్త్రము ఉపాసన రహస్యంబులను దెల్పుచుఁ బ్రత్యవాయ
ములు రాకుండఁ దమ సన్నిధియందే కొందఱకు ఉపాసనలు చేయించు
చుండిరి. కావునఁ జతుర్వర్ణంబులయందుఁ దమ విద్యాగురువులుగఁ దలఁచి
వేలకొలఁది భక్తులు ఉభయసంధ్యలయందు శిరములఁ గరముల మొగిడ్చి
శ్రీకల్యాణానంద పవిత్రపాదుకల మ్రొక్కుచున్నారు. దీనికిఁ దోడుగఁ
దాము దిగ్విజయముచేసిన ప్రతిదేశమునందును దమ యితరోపన్యాసములతో
పాటు మంత్రశాస్త్రమునుగూర్చిగూడ నుపన్యాసములను గావించుచుండిరి.
గొప్పగొప్ప నగరములయందుఁ గేవలము మంత్రశాస్త్రమును గూర్చియేగాక
కొన్నికొన్ని సమయములయందు ఉపన్యసించుచుండెడివారు. శ్రీవారి బాహి
రంబులగు ప్రత్యుపన్యాసంబునందును వర్ణాశ్రమాచారవిధులకును ఉపాసన
పద్ధతులయందలి వివిధ విశేషములకును శాస్త్రీయంబగు కార్యకారణభావము
తనకుఁ దాన గోచరించుటచేఁ బ్రతివిషయమునను ఏవిధి ఎందులకు ఒనర్పఁ
బడుచున్నదో అనువిషయము జనసామాన్యమునకు గోచరించుచుండెను.
కావున శ్రోతృజనమునకంతకును మూఢశ్రద్ధతోఁగాక కారణ జ్ఞానపూర్వ
కంబుగఁ దమవిధుల నెరవేర్చుకొనుభాగ్యమబ్బెను. ఇట్టి మహోపన్యా
సంబులఁ జూఱగొను వేలకొలఁది జనులు తమతమ యుపాసనాసక్తి
విన్నవించుకొని తమ తరణంబులకెద్దియేని ఒక మంత్రమును యథాధికార
ముగ ఉపదేశము నొంది కృతార్థులమైతిమను సంమోదముతో నేగుచుండిరి.

ఇట్టి శ్రీవారి సహస్రాధికంబగు శిష్యసంతతి యందు ఏరికిని ఉపా
సనామూలమునఁ బ్రమాదము వాటిల్లకుండుటయుఁ గొలఁది శిష్యులతోఁ
గూడిన యితరసంప్రదాయముల యందలి యుపాసకవర్గము తమమంత్రోపాసన
మునఁ బ్రత్యవాయముల వాతఁబడి యైహికాముష్మిక నిశ్రేయసంబులనుండి
భ్రష్టులగుటయుఁ జూడ ఈ సంప్రదాయశుద్ధియు దేశికమాహాత్మ్యమును గోచ
రింపక మానవుగదా! ధర్మవిధులందు హేతుహేతుమద్భావము గానక
ఎంతయో తల్లడమందు నాంగ్లభాషాధ్యేతృగణమునకు భారతీంద్రుల యుపన్యా
సము రసాయనమై యొప్పుచుండెను. కావున వారలందఱు ఎల్లన శ్రీవారి
కడ శుశ్రూషయొనర్చి తమ నిశ్రేయసంబునకుఁ ద్రోవఁబడయ సంకల్పించు

కొనుచుండిరి. కావుననే భారతీంద్రులకడ మంత్రోపదేశము నొందిన ఛాత్ర వితతియెల్ల వేదవేదాంగాది విద్యాపారగులతోడను ఉన్నతంబులగు నాంగ్ల భాషా బిరుదంబులం బడసినవారితోడను శోభిల్లుచున్నది గాని ఉదరపూరణార్థులగు దేవానాం ప్రియచక్రవర్తులలో ఎంతమాత్రము తమఃపతితముగా లేదు.

ఇట్టి శిష్యవిషయములో జగద్గురువులొప్పుచున్నను దమమనోగతంబగు నాచార్యవ్యాప్తికె వీరలందఱు సాధకులు గాఁజాలరని యెంచి అందు సర్వవిధముల మిన్నలగువారిని గొందఱఁ జేరఁదీసి వారలకుఁ బ్రత్యేకంబుగఁ బూర్ణంబగు శ్రీ విద్యోపదేశము సేసి తంత్రగ్రంథములను బఠింపఁజేసి ఉపాసనారహస్యంబులను బరదేవతార్చనా విధానంబును ఉపదేశించి వారలచేఁ దమసన్నిధియందే పొరపొచ్చెములు గలుగకుండఁ బరదేవతార్చనము చేయించుచుండిరి.

ఏతాదృశవిషయమున వాఙ్ముఖములచేనేమి, శిష్యసంపాదనముచేనేమి లుప్తప్రాయంబగు దక్షిణాచారపద్ధతి నుద్ధరించియు అద్దానిని స్థిరము సేయఁగోరి ఉపాసనావిధులను సూలంకషముగను సశాస్త్రీయంబుగను గార్యకారణ భావంబులతోఁ గూడఁ దెల్పు గ్రంథరాజంబులను వెలయింపఁగోరి తద్రచనమునకుఁ గడఁగిరి. అందు దొలుత శ్రుతిశిరస్సారభూతంబగు నద్వైతసిద్ధాన్తమంత్రశాస్త్రముచేఁ దెలియఁదగినదిగాఁ దలఁచి అద్దాని సత్యత్వమును సాధనాస్త్రములతోఁ దెలుపఁగోరి తత్సాధనప్రకారమంతయు అతిగంభీరముగ రేఖాగణిత పద్ధతితోఁ గూడిన 'బ్రహ్మమీమాంస' యను నొక మహాగ్రంథము మూలమున వెల్లడించిరి. అనన్తరము నిత్యవిధియగు సంధ్యావందనముగూర్చి 'సంధ్యాకల్ప' యనునొక [illegible] భక్తజనులకుఁ బ్రసాదించిరి. కొన్ని నాళ్లకే సకలతంత్రగ్రంథముల సామూలాగ్రముగఁ జర్చించి మూలంబులగు శ్రౌతప్రమాణంబులఁ గ్రోడీకరించి యౌపనిషదసిద్ధాంతమ్మగు నద్వైతముతోఁ దాంత్రిక సిద్ధాంతమును సమన్వయించుచు దుర్వారదురాచార తమంబులను అణఁచు ''తంత్ర[illegible]'' యను నొక యుపాసన గ్రంథమును వెలయించిరి. ప్రతీపాచారుల నిత్యోత్సవం బెంతయో నిత్యోపాసనాపరాయణులను గల్పించుట గని అయ్యది సుమారతః పరిహర్తవ్యమ్మని శాసించి సంప్రదాయ సమా

గతంబగు శ్రీదేవ్యర్చన విధానము సంగ్రహవాక్య సముదంచితమగుట గని యద్దానిని సక్రమంబుగ వివరించి "శ్రీ విద్యాసర్వస్వ"మను పేర శ్రీవిద్యా దర్శన, శ్రీమాతృకాదర్శన, శ్రీ చక్రదర్శనంబులతోఁ గూడిన యొకగ్రంథ మును శిష్యసంతతికొఱకుఁ బ్రసాదించిరి.

ఇట్లుపాసనా విషయమున నెన్నియో విలువగల గ్రంథములను లోకమునకు అనుగ్రహించియుఁ దమ కృత్యములలో ఏదియోయొక గ్రంథ మును వెలయించుట పరిశిష్టమైయున్నట్లు వారు చిరకాలమునుండి తలఁచు చుండిరి. సర్వదా గ్రంథములనువ్రాసి లోకసంగ్రహముచేసియు మనసులోని కొఱంత తీరకుండుటచే దానికిఁ గారణమేమని అన్వేషించుచుండిరి.

ఇట్లుండ ఒకనాఁడు తమ విద్యాశంకర మందిరమున శిష్యగణమునకు లలితా సహస్రనామావళిని అధ్యాపనము గావించుచుండ అననుభూతపూర్వంబు లగు నానందంబులతోడ ఎవ్వియో లోకసముద్ధారకంబులగు భావంబులు ఆ నామములకు గోచరము అగుడు ఛాత్రతతి అధ్యయనమును గావించి వెడలిన వెంటనే అవ్వానిని గ్రంథరూపముగ మార్చిరి. ప్రవచన సమయమున అపూర్వ ముగ భాసించిన యిట్టి సుస్వాదంబులలోఁ గొన్నింటిని శిష్యులకు బోధసేయు చున్నను సంపూర్ణముగ మాత్రము వానిని గ్రంథరూపమున ప్రదర్శీకరించిరి. మంత్రరహస్యంబులతోడను మహాకామేశ్వరీ యంత్రరాజమునకు సూక్ష్మ రూపంబగు కామకళా స్వరూపముయొక్క ప్రదర్శనముతోడను, కాది, హాది, సంఖ్యా, భూమ, విద్యాబీజములతోడను అతిగంభీరములుగ నొప్పు నూటపదు నొకండు నామములకు భావంబులను విపులముగఁ బ్రదర్శించి తక్కుంగల నామ సముదయము అద్దాని వ్యాఖ్యారూపమే యని నిరూపించి ఇద్దానిని అంతయును "కల్యాణ శ్రీకళ" అనుపేర గ్రంథరూపమున లోకమునకు అనుగ్రహించి తరింపఁజేసిరి. ఇట్టి అసాధారణ రహస్యంబులతో ఒప్పు నామరాజంబులు ఏనాఁడు గ్రంథరూపము దాల్చినవో ఆనాఁటినుండియు శ్రీవారి యెద యందుఁగల కొఱంత తిరోహితమయ్యెను. దానితో వారికి ఉపాసనావిషయ మునఁ దమ కృత్యము తీరెఁగదా యను సంతృప్తి గల్గెను. గ్రంథము ప్రకటితం బయిన వెనుక ఇద్దానిని సమగ్రముగఁ బఠించి శిరసాగ్రాహ్యమని అంతర్వాణి

లోకమంతయుఁ బరమమోదము నొందెను. గంభీరములగు నుపాసనావిషయంబులును, ఉత్తమ మంత్రోద్ధారంబులును, జగజ్జనిస్థితిసంహృతిరూపంబగు త్రివిధకార్యంబులును శ్రీమాతయొక్క మాతృకాస్వరూపసిద్ధియుఁ గల్గినదై కల్యాణశ్రీకళ అతిసూర్యంబుగ వెలుంగఁ జొచ్చినది.

దీనినిబట్టి శ్రవణ పరంపరాగతమగు శంకరుని సహస్రనామవ్యాఖ్యాతృతీయము భాస్కరవ్యాఖ్యామూలకంబు గాదనియుఁ గల్యాణశ్రీ కళామూలకంబేయనియుఁ జేటపడఁగలదు. కానిచో మపంచకమునకుఁ బనిసెప్పు భాస్కరవ్యాఖ్యానము శిష్యపరిగ్రాహ్యమని విశ్వసించి, అసంకీర్ణంబుగ వైదిక మార్గంబును వ్యవస్థసేయ నెంచిన శ్రీవిద్యాశంకరుఁడద్దానికిఁ గడంగకపోవునా? అట్లెన్నటికిఁగాఁజనదు. ఇఁక నేమనఁగా దమ సంప్రదాయమునఁ దమవలె నొక వ్యాఖ్యాన సింహాసనాధీశ్వరుఁడు తప్పక ఇద్దానిని ఉద్ధరింపఁగలఁడని యామహామహుఁడు విశ్వసించి యాపనినుండి విరమించియుండును. తమ వంశస్థుఁడు ఏదేనికార్యము సాధింప నెంచినాఁడనిన మూలపురుషునికి దృష్టిగాని వేఱొక్కరుఁడు సేసిన లోకమునఁ దృష్టిలేదుగదా! అట్టి మహాపవిత్రతమమగు లలితాసహస్ర నామవ్యాఖ్య మనభాగ్యవశంబున మనకాలంబున మన జగద్గురువులచే ఒసఁగఁబడుట మనకేగాక అధునాతన భారతవైదిక సందోహమునకే అమృతప్రదమని మనము చెప్పుకొనుటకు అవలేప పడవచ్చును.

జ్ఞానకర్మంబుల శ్రీవిద్యాశంకర విద్యారణ్యమునీంద్రులవలె ఉపాసనా సరణినంతను దాంభికాచార భ్రష్టులవాతఁ బడకుండఁ గాపాడిన శ్రీ భారతీంద్రులు తమ పరమహంస సంప్రదాయమునందలి ప్రధానాచార్యపూరుషులలో ఆత్మనాత్మీయులగుచు బ్రహ్మవర్చసముతోడ ప్రకాశించు నీసమయమును ఉపాసన తత్త్వప్రతిపాదక యుగమని చెప్పవలయును. దీనితోడ కైవల్యమునకుఁ బ్రధానమార్గంబులగు జ్ఞానకర్మోపాసనంబులు మూఁడును సమ్యగ్వ్యవస్థితంబులగుటచే అనాదికాలమునుండి వచ్చు వ్యాఖ్యాన సింహాసనముయొక్క కృత్యము నేఁటితోఁ బూర్ణముగ అంజసాకృతమయ్యెనని చెప్పవచ్చును.

ఇట్లు జనంబుల సకల కల్యాణంబులకుఁ బెన్నిధానంబగు విద్యావంశమున జ్ఞానకర్మోపాసనారూపంబగు నపవర్గ కారణ త్రితయంబునకు హాని

కలుగు నవసరంబులందు భగవదంశంబున జగద్గురువులగు పరమహంస సార్వభౌములు భౌతికరూపంబున ఉదయమంది గ్లానిగొన్న వైదికధర్మంబులఁ బునరుద్ధరించిరి. అందుచే జన్మవంశంబునకుంబలె విద్యావంశంబునఁగూడ త్ర్యార్షేయసిద్ధి కల్గినది మునిత్రయ సముపేతంబగు శబ్దశాస్త్రమునందువలె ఇద్దానియందుఁగూడ మూలపురుష హృదయగతంబులగు నాశయంబులను వివరించుచుఁ బ్రకృతకాలోచితమార్గంబుల ధర్మమును బ్రకటించుటచే ఈమన విద్దెవంగడమునఁగూడ ఉత్తరోత్తర ప్రాధాన్య మాశ్రయణీయమగుచున్నదని విభుధలోకము గ్రహించు గాక !

ఇట్టి మహనీయుని జీవితచరిత్రము భారతీయులచేఁ బైయాద్యపురుషద్వయ చరితముతోపాటు ప్రాతఃస్మరణీయంబగుటచే అట్టి పవిత్రతమంబగు శ్రీచరిత్రమును యథామతిగవ్రాసి భక్తబృందసంతరణమునకు లోకసమక్షమున సమర్పించుభాగ్యము నాకుఁగల్గినది.

శ్రీహారి యపారమగు లోకానుగ్రహమును సమగ్రముగ వివరింప సమకట్టితిని గాని అద్దానికి దేశకాలస్థితులు అడ్డుతగిలినవి. కావున శ్రీచరణుల ధర్మసంస్థాపనమంతయు సూత్రరూపముననే పేర్కొనవలసి వచ్చినది. ధర్మసంస్థాపనమునకై భారతదేశమునందు ఎల్లయెడలను సహస్రంబులకొలఁది మహోపన్యాసంబులను అనంతములగు దేవతాప్రతిష్ఠలను వారుచేసిరి. అవ్వానిని ఇట కృత్స్నముగఁ బేర్కొననవకాశము లేకపోయినది. కావున ఇయ్యది వారి సువ్యక్తసమగ్ర చరిత్రంబునకు రేఖారూపంబును సూత్రరూపంబును మాత్రమే అగుచున్నదని సుధీలోకంబునకు విన్నవించుచున్నవాఁడను.

గుంటూరు,
చిత్రభాను వైశాఖ శుక్లాష్టమీ
గురువాసరము,
23—4—42.

నీలకంఠశాస్త్రి.

శ్రీః

# కల్యాణలీల

నారాయణసమారంభాం విద్యాశంకరమధ్యమామ్ ।
కల్యాణానందపర్యన్తాం వందేగురుపరంపరామ్ ॥

దక్షిణదేశమునఁ గావేరీ తటమునందు 'వెలంగమాను' అను నొక గ్రామమున్నది. నేఁటి కాలపరిస్థితులచే ఈనాఁడు ఆగ్రామమంత ప్రసిద్ధము కాకపోయినను చోళవంశజులు రాజ్యమేలు సమయమున అయ్యది శ్రోత్రియపుంగవులతో విరాజిల్లుచు 'వేదభూమి' యని వాసికెక్కెను. నామమాత్రమున రాజు దానికిఁ బ్రభువు అయినను నిజాచార పరిపూర్ణులగు నందలి విప్రులు ఏనాఁడును ప్రభువును బూజ్యభావముతోఁ జూడలేదు. అయ్యది తనకు ఆశీస్సు అని రాజు తలంచువాఁడు!

ఇట్లుండఁగా ఒకనాఁడా ప్రభువు ఆగ్రామమునందలి వైదిక గ్రామమునకు గ్రామణియు భార్గవగోత్రజుఁడును అగు పెనువజ్ఝలను నతనిఁజేరి తనకు వైదిక సంస్కారములను జేయ వేఁడఁగా ఆతండును బ్రభువు ద్విజేతరుండగుటఁగాంచి యద్దానికి ఇయ్యకొనక అట్టి జనపదంబుననున్నచో ఏ కీడు మూఁడునో యని సాటివంశంబులతోఁగూడ సాగ్నిహోత్రుడై క్రమముగ గోదావరీమండలము చేరెను. అప్పుడు ఆతనిని వెలంగమానునుండి పదుమూఁడు గోత్రములవారు సాగ్నులై అనుసరించిరి. వారలనందఱను గని ఆ వీటిరాజగు వత్సవాయి వంశస్థుఁడు వారి చరణ నిధానముచేఁ దన్ను ధన్యునిగాఁ

దలఁచుకొనుచు ఆబృందమునకుఁ బ్రధానుఁడగు పెనువక్ష్ఘలు గారిని వేఁడి తనరాజ్యమున వారల నెల్లైన నిలుపఁదలఁచి నట్లును దాను వారలకొక యగ్రహారమును నెలకొల్పఁ దలఁచినట్లును విన్నవించి ర్యాలి యనునొక గ్రామమున నంతయు నేర్పఱచెనే కాని అయ్యది సదాచార సంపన్నము కాకపోయెను. అంత గౌశికాతీరమునందలి యొక ప్రదేశమున నూతనముగ నొక యగ్రహారమును నిర్మించి యందు బ్రాహ్మణులకు వలయు సాధనంబుల నేర్పఱచెను. నాఁటినుండియు అయ్యది "పేరూరు" (పెరియఊరు) నాఁబరఁగుచుండెను. వైదిక శిరోమణులగు దాక్షిణాత్యద్రావిడులకు ఆంధ్రదేశమున నయ్యదియే ప్రథమ ప్రభవమగుటచే నేఁడు అచ్చటచ్చటఁ జెదరియున్న ద్రవిడుల కందఱకు నదియే మూలాధారమై యొప్పెను.

అట్టి పేరూరు గ్రామమునకు నిదానంబగు పెనువక్ష్ఘలు గారికి సాంగోపాంగముగ వేదము నధ్యయనముచేసిన యైదుగురు పుత్రులు శంకరునికిఁ బంచముఖములట్లు వెలయుచుండిరి. వారిలో జ్యేష్ఠపుత్రుని వంశములోనివాఁడగు లక్ష్మణశాస్త్రి యనునాతఁడు తీర్థయాత్రాభిలాషతోఁ దూర్పుదేశమునకు రాఁగా అచటి పండితు లాతని సద్వంశమును అంతకు మున్నె ఎఱింగినవారగుటచే ఆతని సర్వవిధముల నాదరించి క్రమముగా విజయనగర భూపాలునికిఁ బరిచయము గావించిరి. రా జాతని వైదుష్యమును లెస్సగా గ్రహించి ఆతని నెల్లైనఁ దన యాస్థానమున నిలువరింపఁగోరి ఆతనికిఁ బవిత్రంబగు గోస్తనీసాగరసంగమ ప్రదేశంబునఁగల సంగమవలస (సంగివలస) అను గ్రామమును నెలవుగాఁజేసి జీవయాత్రకు

దగువసతులను సమగ్రముగ నొసంగెను. నాఁడు మొదలు వారికుటుంబము అచటనే నిలిచిపోయెను. ఆతనిపుత్రుఁడగు వీరేశ్వరశాస్త్రియుఁ బౌత్రుఁడగు లక్ష్మణశాస్త్రియుఁ దమ పూర్వులవలెనే సక్రమముగ వేదశాస్త్రములను అధ్యయనము గావించి ఆస్థానవిద్వత్స్థానంబులను అలంకరించిరి. లక్ష్మణశాస్త్రి తనయుఁడగు వీరేశ్వరశాస్త్రి దాను వేదాభ్యాసముగావించియు వర్తకమునందు అభిరుచి గలవాఁడై సమీపమునందలి భీమునిపట్టణమను సాగరతీరమున వర్తకంబున కనుకూలంబులగు గృహంబులను నిర్మించి వర్తకమును నడుపుచుండెను. అతనిపుత్రుఁ డగు లక్ష్మణశాస్త్రియు అపారమగు సముద్రవ్యాపారమును నిర్వహించుటకు ఎక్కువకాలము భీమునిపట్టణముననే గడుపవలసి వచ్చుచుండెను. ఆయనపుత్రు లగు సోమయాజి, వీరేశ్వరశాస్త్రి, సర్వేశ్వరశాస్త్రి, అరుణాచలశాస్త్రి అను నల్వురిలో వీరేశ్వరశాస్త్రి మహామేధావియై గ్రామమునందలి వ్యవహార నిర్ణయమునకుఁ దానే సమర్థుఁ డనిపించుకొని వైదికలౌకికములందుఁ బెద్ద పేరుమోసెను. ఈతని సమయముననే వీరి వంశమునఁ గామేశ్వరి ఇష్టదేవతయై వెలసెను. కావుననే తనకుఁ గల్గిన పుత్రుల కిర్వురకును 'కామేశ్వరశాస్త్రి' యనియే యభిధానమును గావించి భేదమునకుమాత్రము 'చిన్న' 'పెద్ద' యను నుపపదంబులతో వ్యవహరింపఁ దొడఁగెను.

ఇది యిట్లుండఁ బేరూరనున్న చాలమంది ద్రవిడులు రాజాస్థానములందు గౌరవములనందుచుఁ గ్రమముగాఁ దూర్పు దేశమున వ్యాపించి అగ్రహారముల సంపాదించి గౌరవపాత్రులగుచు అందే నివసించుచుండిరి. అట్టివారి సంఘ మిప్పటికిని

‘పేరూరుద్రవిడ’ పదముచేఁ బేర్కొనఁబడుచున్నారు. వీరు
తూర్పుదిశకువచ్చి విజయనగర రాష్ట్ర ప్రభువులచే సన్మానింపఁ
బడిన వంగడములలో విజయనగర సమీపగ్రామ మగు
నేకతాళాగ్రహారమునందలి (ఒంటితాడి అగ్రహారము) యాత్రి
గోత్రజులగు ‘తాతా’ వారి వంశ మొకటి గలదు. ఇందు
వేదమూర్తులు నాఁ దనరు సూర్యనారాయణావధానిగారు
ఛాత్రతతికి ఆమ్నాయాధ్యయనము గావించుచుఁ శిష్యప్రశిష్యుల
కెల్ల సాటిలేని యామ్నాయవేత్త యని కీర్తిఁబొందెను. ఇట్టి
వేదపురుషునకుఁ జంద్ర సూర్యరూప మగు పరమేశ్వరుని
నేత్రద్వయమువలె ఆమ్నాయపారగులగు సప్పావధానిగారును
తమ కూలంకష సకలశాస్త్రపాండితీప్రభచే జిజ్ఞాసుహృద
యాధిగూఢతమిస్రమును అపనయించుచుఁ దమ విద్యావంశ
పాదప సుమగంధము భారతదేశమునం దంతటను వ్యాపింప
నొకకడ విద్యామూర్తియు వేరొకదిశ వ్యవహారమూర్తియు
నగుచు వెలుఁగొందు వైయాకరణసార్వభౌమ, కళాప్రపూర్ణ,
మహామహోపాధ్యాయ, సుబ్బరాయశాస్త్రిగారును ఉద
యించిరి. శ్రీభూదేవులవలె నొప్పు నన్నపూర్ణా పార్వతీ
దేవులు వీరి తోఁబుట్టువులు.

పైఁజెప్పఁబడిన వీరేశ్వరశాస్త్రిగారు తమ కామేశ్వరు
లకు ఉపనయనము మాత్రము గావించి పసిదనముననే కాల
గతి నొందుటచే వారిద్దఱును విజయనగరమునఁ దమ మేన
మామ యింటఁ బెరిగిరి. క్రమముగాఁ బెదకామేశ్వరశాస్త్రి
గారు వైద్యమును నేర్చి భిషగ్వరులై తమ స్వగ్రామమగు
భీమునిపట్టణమునకు వెడలిపోయిరి. ద్వితీయులగు చినకామే
శ్వరశాస్త్రిగారికి మేనమామ తగుసంబంధమును జూడఁదలఁచి

ఏకతాళాగ్రహారమునఁ గల సూర్యనారాయణావధానిగారి ద్వితీయపుత్రికయగు సౌభాగ్యవతి పార్వతీదేవి అనుకూల యగు కన్యకయని ఆమె నిచ్చి వివాహ మొనర్చిరి. చిన కామేశ్వరశాస్త్రిగారును "మెట్రిక్యులేషను" పరీక్షయందు ఉత్తీర్ణులై విశాఖపట్టణ మండలమునందలి చోడవరమను గ్రామమున మాధ్యమిక పాఠశాలకుఁ బ్రధానోపాధ్యాయులుగాఁ బ్రవేశించిరి.

కొంతకాలమునకుఁ బార్వతీ కామేశ్వరుల గర్భమునఁ గామేశ్వర ముఖాలోకకల్పిత శ్రీగణేశునివలెఁ గారణజన్ములగు శ్రీ జగద్గురువులు చిత్రభానువత్సర వైశాఖశుద్ధాష్టమీ జయవాసరంబు నుదయంబున మిథునలగ్నమునందుఁ బుష్యమీనక్షత్రమున ఏకతాళాగ్రహారమునఁ దమ మాతామహగృహంబున అవతరించిరి.

అప్పటి గ్రహకూట మిట్లున్నది :—

అశ్విని చతుర్థమున రవి; పుష్యమి తృతీయమునఁ జంద్రుఁడు; పునర్వసు చతుర్థమునఁ గుజుఁడు; అశ్విని తృతీయమున బుధుఁడు; రోహిణి ప్రథమమున గురువు; కృత్తిక ద్వితీయమున శుక్రుఁడు; భరణి ద్వితీయమున శని; అనూరాధ తృతీయమున రాహువు; రోహిణీ ప్రథమమునఁ గేతువు. జననకాల శనిమహాదశాశేషము 7 సం॥ 6 మా॥ 29 దివసములు. పుట్టుకతోడనే తేజస్వియగు పుత్రునిఁ జూచి జననీజనకులు సుహృద్బంధువర్గమును అపారమగు ముదము నొందిరి. బిడ్డనికి యథావిధి సంస్కారములఁ గావించి తమ యభీష్టదైవంబగు కామేశ్వరీదేవిఁ గొల్చి ఆపవిత్రాఖ్య చేతనే

కామేశ్వరశర్మయని పిలువఁజొచ్చిరి. తమకు ఇద్దఱు పుత్రికలన్ పాటు ఒకఁడే బిడ్డండు కలుగుటంజేసి తల్లిదండ్రులల్లారుముద్దుగా బాలుఁ బెంచుచుండిరి. కుమారునికి ఐదవయేఁడు రాఁగానే తండ్రియే తనయొద్ద అక్షరాభ్యాసముగావించి క్రమముగా సంస్కృతాంధ్రాంగ్లభాషలను ఉర్దూభాషనుగూడఁ జెప్పఁదొడఁగెను. బాలుఁడు పాఠశాలయందుఁ బ్రవేశించి తోడిబాలురకన్న మిన్న యనిపించుకొనుచుండెను. బడినుండి రాఁగానే జనకునియొద్ద నీతిని, ధర్మమును, మతమును బోధించు ననేకకథలను శ్రద్ధతో వినుచుండెను. పూర్వవాసనాబలము ఎట్టిదోకాని అందు శంకరచరితమన్న బాలుఁ డమితోత్సాహముగిని పరవశుఁడగుచుండెను. వేదాధ్యయనమునఁ దనకు అతివేలంబగు నుత్సాహమున్నను బితృ నియోగానుసారియై తాను ఎట్లో ఆంగ్లమునే చదువవలసివచ్చెను. కాని యేవేని విశ్రాన్తిదినములు వచ్చినచో అందుఁ బ్రత్యేకముగ మాతామహగృహంబునకు వచ్చి అట సామాన్యముగు వేదభాగములను జదువుచుఁ గ్రమముగా అవ్వానిని సేకరించెను.

నాఁటి ద్రావిడశాఖా మర్యాదననుసరించి బాలునికి వివాహవయస్సు దాఁటిపోవుచున్నదే యని బంధువర్గము త్వరసేయఁ జనకామేశ్వరశాస్త్రిగారు తమ ముద్దుబిడ్డనికి విజయవత్సర మాఘ బహుళ విదియా సోమవాసరంబునఁ దమబంధువులలో నొక శ్రోత్రియకుటుంబమునకుఁ జెందిన యొక కన్యనిచ్చి శుభముహూర్తంబున ఏకశాఖాగ్రహారము ననే వివాహమును గావించిరి.

కాలగతి ననుసరించి జరుగు పనులకుఁ గూడఁ గార్య కారణభావముకల్పించుట లోకసహజమైయున్నది. వివాహము నాఁటి పంచమదివసముననే పార్వతీదేవి కైలాసగిరికేగెను. ఇట్టి ఘోరవిపత్తు తటస్థించుటచే బంధుమిత్రాదులు చకితు లైరి. ఇఁక నేమున్నది? పీతిహోత్రునికి ఆజ్యాహుతి అయినది. ముక్కుపచ్చి ఆఱని ఆపసిబాలకుని ఆ దృశ్య మంతయు ఒకసారి భయాశ్చర్య సంభ్రాన్తునిగాఁ జేసినది. బాల్యమునుండియు ప్రపంచతత్త్వ విచారపరుఁడగు మన కామేశ్వరునకు ఆనాఁటి దృశ్యము అస్థిగతమై హృద్గతభావము లకు మఱింత దోహదము నిచ్చెను. అది మొదలు అతఁడు పరవేదనాఽసహిష్ణువై ఒరులు శిరోవేదనను అనుభవించు చున్నను జూడఁజాలక తొలఁగిపోవుచుండెను. క్రమముగా ఇట్టి సంఘటనముచే నిరంతర తత్త్వవిచారము హెచ్చె ఆతనికి గార్హస్థ్యమందు గర్హ్యభావమే యేర్పడఁ జొచ్చెను.

ఇట్టి విషమపరిస్థితులలో జనకుఁడు దమ్ము భీముని పట్టణములోనే పెదతండ్రిగారి యొద్దనుంచుటచే మన కామే శ్వరులు అటనే నాల్గువత్సరంబులుండి ప్రారంభవిద్య యందుఁ గృతార్థులైరి. అట్టిసమయముననే భీమునిపట్టణమునఁ బెదకామేశ్వరశాస్త్రిగారు పేరుమోసిన వైద్యులగుటచే వారియింట ఒకమూల ఔషధనిర్మాణము, వేఱొకచోట రోగనిదానచర్చయు జరుగుచుండ మేధావులగు మన బాల కామేశ్వరులు ఔషధనిర్మాణమునను దద్వినియోగమునను రోగనిదానమునను మంచి ప్రావీణ్యము సంపాదించిరి.

ఆనాఁడు భీముని పట్టణమునందుఁ గ్రీస్తుమతబోధకులు సనాతనమతమును దూషించుచుండుటచే అద్దానిని సహింపక

వారి బైబిలునందలి యసంగతములను విమర్శింపనెంచి చిన్న తనముననే వారు బైబిలు చదువ దొరకొనిరి.

అనంతరము 1896 వఱకు భీమునిపట్టణముననేయుండి ఆచటి చదువు పూర్తిచేసి ప్రారంభించిన యాంగ్లవిద్యను బూర్తిసేయుటకు సమీపమునఁ గల విజయనగరమునకు వారు వెడలఁదలఁచిరి. అదియుఁగాక తనమనమునందెన్నియో దినములనుండి చదువ నుత్సాహపడు వేదవేదాంగము లన్నియు అటఁ బ్రచారములోఁ గలవని వారికి బాగుగాఁ దెలియును కావున భీముని పట్టణమునుండి విజయనగరమునఁ దమ పెదతల్లిగారింటికిఁజని 1897 వ వత్సరమున హైస్కూలు తరగతియందుఁ బ్రవేశించిరి.

తీవ్రమగు బాలకామేశ్వరుల విద్యాసంపాదనాభినివేశమును ఆనాఁటి విజయనగర పరిస్థితులు మఱింత ఉత్తేజింపఁ జేసినవి. నగరమునుఏలు రాజు సకలవైదిక ధర్మతత్పరుఁడును సకల కలాతత్వజ్ఞుఁడును రసజ్ఞ సార్వభౌముఁడును పండితాభిమానియు నగు నానందగజపతీంద్రుఁడు. పురము నందుఁగల రెండు మూఁడు పేఁటలు కేవలము సకలవిద్యల యందు దిగ్దంతులగు ద్రవిడశిరోమణులచేతను దక్షిణగల విద్వద్వితానముతోడను అలంకరింపఁబడినవి. ఒందొకవీధికిఁ బోయిన నొకచోఁ ద్రికాండశ్రౌతమును దమ ఛాత్రులకుఁ బాఠనముచేయు శ్రౌతిలోకమును, వేఱొకచోఁ బౌండరీకాన్త సప్తతంతు సంతానముల నొనర్చి యందు జరిగిన కర్మకలాపంబులను శ్రౌతులతోఁగూడఁ జర్చించు యాయజూకు లును, వేఱొకవంక వీధీవేదికలపైఁ గూర్చుండి ఘనాన్త స్వాధ్యాయమును ప్రాతిశాఖ్యతోఁగూడఁ దమయన్తేవాసి

సందోహమునకుఁ జెప్పు శ్రోత్రియులును, ఉపనయన వివాహాది కర్మలకు ఆవశ్యకంబులగు శ్రౌతస్మార్త భాగంబులను శిష్యతతిచే రువ్వులువెట్టించు వైదికులును గోచరించుచుండిరి. ఆర్యతటాకతటంబునఁ దామప్పుడే మహారాష్ట్రదేశమున గణేశలక్ష్మణఛత్రి యను జ్యోతిర్విద్వదవతంసుని సన్నిధి బాలగంగాధరతిలక్ మహాశయునితో పాటు గోళకగణిత శాస్త్రంబుల రెండిటిని సమగ్రముగ అధ్యయనముచేసి సకల సవనంబుల నొనర్చి అసంఖ్యేయమగు శిష్యగణము తమ్ము పరివేష్టింప అవ్వారలకు మంత్రతంత్రరహస్యంబుల నుపదేశించుచు రసవాదముల విమర్శించుచున్న దైవజ్ఞసార్వభౌమ రాజ్ఞి మహాగ్నిచిత్ నృసింహ విద్వద్గ్రామణి అవతరించి యుండెను. వేఱొక రథ్య మెట్టినచో శ్రీసుబ్బరాయశాస్త్రి గారు కొందఱ శిష్యులకుఁ బాతంజల మహాభాష్యాది వ్యాకరణగ్రంథములను, మఱికొందఱకుఁ బ్రస్థానత్రయమును, ఇతరులకు రసగంగాధరాన్యుత్తమాలంకార గ్రంథములను గొందఱకు న్యాయవైశేషిక భాష్యంబులను గొందఱకు వేద భాష్యంబులను గొందఱకు ధర్మశాస్త్రంబులను బోధించు చుండిరి. వారి గురువరేణ్యులగు రుద్రాభట్ల రామశాస్త్రి గారు తమ గృహమండపముల నెల్లప్పుడు విశ్వవిద్యాపరిష న్మండలములుగఁ జేసి ఛాత్రులకు మనోహరముగఁ బాఠము లను బోధించుచుండిరి. శివజటాజూటమునుండి మందాకినిని మేదినికి నవతరింపఁ జేసిన భగీరథునట్లు కాశికావిశ్వేశ్వర సన్నిధానమునుండి వ్యాకరణ జాహ్నవీశాఖను విజయనగర మున వెలయించిన పేరి వేంకటశాస్త్రిగారు తాము కడు వృద్ధు లయ్యుఁ దమ సప్తశతీపఠనముతోపాటు వ్యాకరణపాఠము

లనుగూడ బోధించుచుండిరి. వారిపుత్రులును అగర్గళ సరస కవితాసంపన్నులును శబ్దశాస్త్ర పాండితీప్రభావసంపన్నులు నగు కాశీనాధశాస్త్రిగారు వ్యాకరణాలంకారశాస్త్రంబులను అధ్యాపనముసేయుచు ఒకప్పుడు కవితాగోష్ఠులను, ఒకప్పుడు ఆనందగజపతీంద్రునితో సరస కేళీవినోదంబులను గావించు చుండిరి. సుబ్బారాయశాస్త్రిగారి వేదాన్తాచార్యులును సాహిత్యసమ్రాట్టులు నగు కొల్లూరు కామశాస్త్రిగారు ఒక వీధియందు అంతేవాసిగణమునకుఁ బాఠములు చెప్పుచుండిరి. నద్వైతరతరకంబుల రెండిటిని శిష్యగణంబులకు బోధసేయుచు అపరగౌతముఁడు నాఁ దనరు గుమ్ములూరి సంగమేశ్వరశాస్త్రి గారు ఒక దిశ విలసిల్లుచుండిరి. విశిష్టాద్వైతసిద్ధాన్తకోవిదు లగు ముడుంబి నరసింహాచార్యులుగారును, ఉభయభాషా సారజ్ఞులగు మండచిట్టి కామశాస్త్రిగారును, జ్యోతిర్విద్యా విశారదులగు ఆదిరాజు జోగావధాని, మండ నృసింహసిద్ధాన్తి ప్రభృతులును దమ తమ విద్యలను ఛాత్రవితానంబునకుఁ గఱపుచుండిరి. నవ్యసాహిత్యవిశ్వస్రష్టులగు గురజాడ అప్పా రాయకవీంద్రుఁడు తన ముత్యాలసరములతో సరసలోకము నలంకరించుచుండెను. ఇట్లు శాస్త్రసాహిత్యంబు లొకవంక వెలుఁగుచుండ "నారాయణదాసోపజ్ఞము హరికథ" యను సమాఖ్యను వహించిన శ్రీమదజ్జాడాదిభట్ట నారాయణదాసుఁ డను ద్రవిడశేఖరుఁడు దన గానకలావిభవమును దిశలకు వ్యాపింపఁ జేయుచుండెను. శారీరకబలప్రదర్శనమునుగావించి కోడి రామమూర్తియొక్క గురువు విశ్వమాన్యుఁ డగు చుండెను. ఇంకను అనేక నాటకకళాప్రదర్శనములచేతను

ఆనాఁడానగరము ఆనందగజపతీంద్రునిచేఁ బాలింపఁబడుచు విద్యానగరమను దనపేరు అన్వర్థము చేసికొనుచుండెను.

ఇట్టి మహోత్కృష్ట సమయాన నిశితబుద్ధి విభవము గల ఒప్పు మన కామేశ్వరులు ఉత్సాహ సంపత్సమేతులై విజయనగరమునకు విద్యాసంజిఘృక్షచే ఏతెంచిరని నుడివితినిగదా! పైని పేర్కొనఁబడిన విద్యానగర వైభవమునకు యింతకును ద్రవిడభూసురులే కారణభూతు లగుటచేతను, ఆవ్వారు తమకు అత్యన్తసన్నిహిత బంధువులు అగుటచేతను సుముహూర్తమున ఆయాయి వేదభాగంబులను శాస్త్రంబులను వారియొద్దఁ బ్రారంభము సేసిరి. శాస్త్రపాఠముతోడఁ బ్రపంచతత్త్వ విమర్శనమునుగూడఁ జేయుచుండుటచేఁ గ్రమముగా సంసారవిషయములందు హేయభావమేర్పడఁజొచ్చెను. మిత్రసంఘములతో నెంత షికారులు చేసినను సరియగు సమయమునందుఁ దమ యాత్మతత్త్వ విచారమునకు నిత్యకర్మానుష్ఠానమునకును హాజరుకావలసినదే!

ఇట్లు కృత్యంబులను యథావిధి నడుపుకొనుచుఁ గ్రమముగా 1901 వ సంవత్సరమున 'మెట్రిక్యులేషను' పరీక్ష కాఁగానే పొంగిపొరలు వైరాగ్యసంపదతోఁ గూడి సంన్యాసగ్రహణోత్సాహమున వారణాసీపురంబునకు వెడలిపోయిరి. కాని అచటి మస్కరుల కుహనామాత్ర పరత్వమును భిక్షాకదంబక గవేషణంబును గాంచినంతనే, భాగిరథీస్నాన విశ్వేశ్వర దర్శన ప్రభావముచేతను గాఁబోలు తనకు విద్యావైభవము చాలదని తోఁచి యిట్టిసమయమున సంన్యాసము తీసికొనఁదగదని ఆప్రయత్నమునుండి అప్పుడ విరమించి విద్యార్జనమునకుఁ దమ నికేతనమే సర్వవిధముల ననుకూల

మైనదని యెంచి విజయనగరము రాఁగానే తమ 'మెట్రికుస్ లేషన్' పరీక్ష సఫలమైనట్లు సుహృద్వర్గము తెలిపెను.

శీతవిశ్రాన్తిదినములు తీరినవెంటనే F. A. (ఎఫ్. ఎ.) తరగతియందుఁ బ్రవేశించి నగరమున గొప్పయుపాసకులుగాఁ బేరెన్నికగన్న రాణి మహాగ్ని చిన్నప్రసింహాచయనులవారి నాశ్రయించి యొక మంత్రదీక్షఁబొందిరి. అయ్యదియే మన బాలకామేశ్వరులకు ఉపాసనమునందుఁ బ్రథమప్రవేశము. క్రమముగా బి. ఎ. (B. A.) తరగతికి వచ్చునరికి శ్రీవిద్యోపాసనవిషయములను గురువులనుండి గ్రహించుచుఁ బూర్వము నే యారంభించిన యుపనిషత్తులను సేకరించి వేదాన్తగ్రంథములను జదువనెంచిరి. అందుఁ దొలుత గీతను సవిమర్శంబుగఁ జదివి ఆ కాలమున నూతనప్రతిష్ఠితంబగు హిందూసమాజ గీతాపరీక్షలో వారు ప్రథములుగా ఉత్తీర్ణులై ప్రథమ పారితోషికమును బొందిరి. అప్పుడు వారు సమాధానపత్రములపై వ్రాసిన సమాధానములు ఎంతయో సవిమర్శంబుగను సాధారణ పురుషబుద్ధులకు అగోచరంబులుగను స్వతంత్ర భావోపేతములుగను ఉన్నవని పరీక్షాధికారులవలనఁ గ్రమముగాఁ దెలిసినది. ఇట్లు దాము బహుమతులను బడయుటయే గాక కోరిన తోడిఛాత్రులకెల్ల గీతల నుపదేశించుచు వారలను ఆ పరీక్షకుఁ బంపుచు నెందఱకో పారితోషికముల నిప్పించిరి. ఈ విధమున ఒకప్పుడు ఇతరులకు గీతలను ఉపదేశించుచును, గలాశాలయందలి పాఠములను వేఱొకప్పుడు చదువుకొనుచును ఉదయమున నే ఉపనిషత్తులను అధ్యయనము గావించుచునే యవకాశము లభించినపుడెల్ల తమ మాతుల సన్నిధిని ఉపనిషత్సూత్రభాష్యంబులను శాన్తి చేసిరి. ఇట్లే

జ్యోతిర్విద్యను గావ్యనాటకాదులను అయా పండితులయొద్దఁ జదువుచుండిరి.

మతవిషయమునఁజూచినచో అదిమిక్కిలి గడ్డుకాలము. అందునను విజయనగరము సకల కళలకు ఆకరమగుటచే అందఱును దమతమ మతములను అచటఁ బ్రతిష్ఠింపఁజేసి ఎక్కువ ప్రతిష్ఠనుబొందఁ గోరుచుండిరి. కావుననే బ్రహ్మసమాజ ప్రబోధములను, దయానందుని యార్యసమాజ విజ్ఞానములను, అన్యేభశాంతమ్మ దివ్యజ్ఞానవిఖ్యాతియు అట నెలగొల్పుట కెందఱెందఱో ఎన్నియో ఉపన్యాసంబుల నొసంగు చుండెడివారు. అట్టి తఱి బాలకామేశ్వరులు వారలకుఁ బ్రతివాదిగ ఉపన్యాసవేదికలపై సాక్షాత్కరించి అవ్వారి మతములను యుక్తియుక్తముగ ఖండించి వైదిక మతప్రాశస్త్యమును నిలువఁబెట్టుచుండిరి. ఇట్టి సంఘటనము వలనఁ గ్రమముగా ఆయా మతబోధకులు విజయనగరమునకు రా వెఱచుచుండిరి. ఇట్లు ఒకవైపు మతవిషయమున మిగుల సేవచేయుచున్నను దమ తరగతియందుఁ దమ 'గ్రూపు' అగు రసాయనశాస్త్రమునఁ బరిశోధనముల నన్నిం టిని సక్రమముగఁ జేయుచు ఉపాధ్యాయులచే మెప్పువడుచు 1905 సంవత్సరమున బి. ఎ. పరీక్షయందు ఉత్తీర్ణులైరి. తమ వెంటఁ దిరుగు ఛాత్రావళికిని మిత్రబృందమునకుఁ గూడఁ దమ గురుసన్నిధినే ఏదియో యొక మంత్రమును జెప్పించుచు ఉపాసనాసక్తి గల్గించుచుండుటచే ఉపాసనమునందు బాలకామేశ్వరులకుండు శ్రద్ధగని శ్రీచయనులుగారు వారికిఁ బ్రతి దినమునను రాత్రియందును మంత్రశాస్త్ర రహస్యంబుల నుపదేశించుచుఁ బూర్ణదీక్షితులుగాఁజేసిరి. దానఁ దమకుఁ

గొంత తురీయాశ్రమాధికారము కల్గినదని లోలోన సంతసించి బి. ఎ. పరీక్షయందుత్తీర్ణులైన వెంటనే తమబంధువుల ప్రోత్సాహమున ఆయూరనే ఒక యుపాధ్యాయపదవి నధిష్ఠించిరి. కాని భృతకాధ్యాపకత్వమునకు మిక్కిలి వగనొందుచుఁ దమమనోరథసిద్ధికి అనువగు సమయము కొఱకు వేచుచుండిరి.

ఇది యిట్లుండ మహాగ్ని చిన్నృసింహామూర్తులు తమ ధర్మపత్నీ వియోగముచే అతివేలంబగు వైరాగ్య సంపద నొంది సచ్చిదానంద భారతులకడ యథావిధి సంన్యాసమును గ్రహియించి బోధానంద భారతులు నానొప్పుచుఁ గ్రమముగా క్రీ. శ. 1906 సంవత్సరమున శృంగేరీ శ్రీవిరూపాక్ష శ్రీపీఠమునకు అధిపతులైరి. పరిస్థితులు తమకు అనుకూలములుగా నున్నవని సంతసించి బాలకామేశ్వరులు 14-8-1907 దివసంబునఁ దమకోరికను శీఘ్రకాలమున నెరవేర్చుకొనుటకు విజయనగరమునుండి అప్పటికిఁ బీఠము విజయముచేసియున్న గోదావరీమండలాన్తర్గతంబగు అమలాపురమునకు ఏగిరి. ప్రియాన్తేవాసి యిట్లు హఠాత్తుగా వచ్చుట శ్రీబోధానంద భారతీంద్రులను జకితులనుగాఁ చేసెను. ఆనాఁటిరేయి ఏకాన్తముగా బాలకామేశ్వరులు గురువులకడఁ జేరి తమ హృదయమును వారికి విప్పిచెప్పిరి. కాని బోధానందులు అప్పటికేమియుమాఱువలుకక రాత్రి అతిక్రమించుచుండుటచే శిష్యునిఁ బరుండఁబంచిరి.

కొద్దిదినములనుండి బోధానందులు వ్యాధిపీడితులై యుండిరి. మూఁడవదినము మఱింత తీవ్రరూపము దాల్చెను. తమ జాతకానుసారముగ అయ్యది మారకసమయమగుటచే

వారు అందులకు సన్నద్ధులై మధ్యాహ్నము మూడు గంటలకు గ్రామమునందలి యున్నతోద్యోగుల రావించి మరణశాసనము నొకదానిని వ్రాయించిరి. తమ యనంతరము పీఠాధిపత్యము వహింపఁగలవారెవ్వరని వారలడుగఁ బార్శ్వవర్తులగు మన బాలకామేశ్వరులను వారు చూపిరి. దానవారలందఱు నివ్వెఱపోఁగాఁ గని భారతీంద్రులు మీ పరిషదనుజ్ఞ అయిననేకాని మే మీతనికి సంన్యాసమీఁదలంప లేదు. మా యనంతరము గురువు లెవ్వరను విషయమును నిర్ణయింపవలయు బాధ్యత మీదే యగుటచే ఈతని యధికారము మీరు పరీక్షింపవలయునని నుడివిరి. వెంటనే యానిండుసభలోని ప్రధానులగు నున్నతోద్యోగులందఱు వివిధంబులగు ప్రశ్నంబులఁ గురిపింపఁగా బాలకామేశ్వరు లద్దానిపై రెండు గంటలు దీర్ఘోపన్యాసము గావించి వారి సందేహములను బాపిరి. దానితో వారలందఱు బాలకామేశ్వరుల జ్ఞానమున కచ్చెరువునొంది వారియోగ్యతను జగద్గురువులకు నివేదించి బాలకామేశ్వరులఁ బ్రశంసించుచుఁ దమతమ నెలవులకేగిరి.

మఱునటిదినమున సమీపమునందలి పేరూరున కీవార్త తెలుప నందలి వైదికబృంద మంతయు వచ్చెను. ప్లవంగ శ్రావణ శుద్ధ చతుర్దశీ గురువాసరంబున (22—8—1907) యథాశాస్త్రంబుగఁ బారివ్రాజ్యంబును స్వీకరించి మన బాలకామేశ్వరులు కల్యాణానంద భారతి యను పవిత్రతమం బగు నభిధానంబుతోఁ దృతీయంబగు జన్మంబు నందిరి.

బోధానందభారతీంద్రుల యారోగ్యముగూడ సరియగు త్రోవఁ బడుచుండెను. అంతఁ జాతుర్మాస్యదీక్ష భాద్రపద

పౌర్ణమినాఁటికిఁ బూర్తికాఁగాఁ బీరముతోఁగూడ వారు నవరాత్రములకుఁ బేరూరు విజయం చేసిరి. నవరాత్రానంతరము బాలభారతీంద్రులు తామింకను శాస్త్రవిషయ జిజ్ఞాసువులై యుంటచేతను పేరూరునందు సకలశాస్త్రంబులందును, శ్రౌతస్మార్తవిషయంబులందును, జగద్విఖ్యాతిఁగన్న పండితు లుండుట చేతను పేరూరి విద్వద్బృందముయొక్క సప్రశ్రయంబగు ప్రార్థనపై నటనిలువ గురువులఁగోర వారద్దానికంగీకరించిరి. అంతఁ దామున్నంతకాలమును ఆ యూరనుండు జమీందారు లగు జిల్లెళ్ళ భానోజీరావుగారు తమ గృహముననే శ్రీవారిని భిక్షసేయ వేఁడఁగా నందులకు ఇయ్యకొనిరి.

వెంటనే సుముహూర్తముచూచి గట్టి శ్రౌతులని పేరుగన్న మూలా పేరావధాని ప్రభృతులు కొంతకాలము ప్రత్యహము భారతీ శ్రీచరణులసన్నిధిఁ జేరి వారితో శ్రౌతవిషయంబులఁ జర్చించుచుండిరి. కొంతకాలము మంత్రశాస్త్రంబున ఘనత వహించిన ఉయ్యాల సోమయాజుల భీమశంకరశాస్త్రి (అబ్బాయి) నాతఁడు శ్రీవారితోఁగూడ మంత్రశాస్త్రరహస్యంబుల విమర్శించుచుండిరి. తర్కవేదాన్తసారజ్ఞులగు మంథా చన్నయ్యశాస్త్రి మరువాడ శంభన్నశాస్త్రిగారలు తమ శాస్త్రాధ్యయనము సఫలమైనదను భావముతోఁ బ్రతిదివసము శ్రీభారతీ గురుచరణ నికటమునఁ దమతమ శాస్త్రంబులను వినిపించుచుండిరి. ఇట్లు 1907 సంవత్సరము మొదలు 1919 వ సంవత్సరము వఱకు మధ్యమధ్య నెటకేని స్వల్పకాలము విజయయాత్ర సేసినను బ్రధానముగాఁ బేరూరనే నివసించి సకలశాస్త్రసారంబులను బాలభారతీంద్రులు చూఱగొనిరి. గ్రామవాసులు బ్రహ్మాదులనుగూడ సరకుగొననివారని ప్రసిద్ధి

నొందినను బాలభారతీంద్రుల విషయమున మాత్రము వారలు నిరుపమానంబగు నణఁకువతో మెలఁగిరనునది దద్గ్రామ తత్త్వమెఱిఁగిన యేరికి నచ్చెరువు గొలుపకమానదు.

ఈ సమయముననే 1908వ సంవత్సరమునఁ గాకినాడ యందు విఖ్యాతులగు కృత్తికంటి పేర్రాజుగారు ప్రాచ్య పాశ్చాత్య సాహితీ విజ్ఞానాభివృద్ధికై వైదికాంగ్ల కలాశాల (Anglo Vedic College) నొకదానిని స్థాపింపఁదలఁచి తను ధ్ధరణమునకై ఉభయభాషాభిజ్ఞులగు బాలభారతీంద్రులను రా వేఁడి కాకినాడపురమునకుఁ దీసికొనిపోయిరి. అట భారతీంద్రులు కలాశాలను స్థాపించి తదావశ్యకతనుగూర్చి రెండుపన్యాసములు గావించిరి. వానితోడఁ గాకినాడపురము మాఱుమ్రోఁగెను. అదిమొదలు పేర్రాజుగారును గంటి సుబ్బారాయఁడను నొక న్యాయవాదిపుంగవుఁడును కల్యాణ శ్రీపాదుల యంఘ్రిభక్తులైరి. అయ్యవి శ్రీరామోత్సవ వాసరంబులగుటచే ఆయూరి కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి గారిచే నెలకొలుపఁబడిన యార్యభారతీ సమాజపక్షమునఁ గొన్ని యుపన్యాస పీయూష రసవాహినులఁ బ్రవహింపఁ జేసిరి. దాన భారతీంద్రుల ప్రతిభావిశేషము కాకినాడ పురమున నందఱచేఁ గొనియాడఁబడుచుండెను.

ఇంతలో భారతీంద్రులు అవైదిక మతోన్మూలనము గావింప నవసరముగలిగెను. అందుఁ దొలుత బ్రహ్మసమాజమత మును నిర్మూలింప నడుకట్టిరి. ఏలయనఁగా పీఠికాపురమునకు రాజు నూతనముగా అభిషిక్తుఁడాయెను. పూర్వుఁడగు గంగాధర రామారాయఁడు సంస్థానప్రతిష్ఠకును తచ్ఛ్రేయోఽభి వృద్ధికిని సర్వవిధములఁ బ్రాచీనానుసారియై వైదికధర్మావిరో

ధమ్ముగ రాజ్యమును బాలించెను. కాని నూతనప్రతిష్ఠితుఁడగు నృపతి యెట్లో రాజుగా నిశ్చయింపఁబడి కొద్దికాలములోనే అవైదికంబును హేయంబునగు బ్రహ్మసమాజమునఁ బూర్ణదీక్షితుఁడై వైదికమార్గబద్ధద్వేషులగు వేంకటరత్నమునాయని కంధుకూరి వీరేశలింగమును, ఆదిపూడి సోమనాథుని, పరమగురువులుగా నెన్నుకొని వైదికమార్గమును ఉన్మూలింపఁ దొడఁగెను. దాన రాజ్యమున వైదికమతద్వేషము స్వైరిత్వము విద్యాగ్రహణపటువులగు బాలురకుఁ బ్రధానముగా నలవడెను. రాజాశ్రితు లగు సాధారణ గృహమేధులు సైతము పాలకానుగ్రహైక పాత్రత్వసిద్ధికై యీ మతము నే యవలంబించు చుండిరి. ఇట్టితఱిఁ బీఠికాపుర జనులు విజ్ఞానప్రబోధక సమాజమను నొక పరిషత్తు నేర్పఱచి వైదికమతవ్యాప్తియే దాని ప్రయోజనముగాఁ దలఁచి యం దుపన్యసించుటకై బాలభానునిఁబగిది తన జ్ఞానకిరణములచే అజ్ఞాన నిద్రాముద్రితుల మేల్కొల్పి క్రమముగాఁ బ్రచండతేజముతో వెలుఁగొందు బాలభారతీ శ్రీచరణుల యశంబును గాకినాడపురంబునందలి యుపన్యాసంబులఁ గని తమ పురమునకు వారలను దోడ్కొనిపోయిరి. అట భారతీంద్రులు ఉపన్యాససమూలమునఁ బ్రతిపక్షిమతంబుల రూపుమాపి వైదికమతము నుద్ధరించి అవైదిక మార్గోన్ముఖులగు బాలురను సత్పథవర్తులుగాఁ జేసిరి.

ఇట్లేకదీక్షతో వైదికధర్మసంస్థాపనమునకుఁ బూనిన బాలభారతుల సమాఖ్య దిగంతములకు వ్యాపింప ఉండూరు, లక్ష్మీనరసాపురము, తుని మున్నగు సంస్థానముల ప్రభువులు శ్రీపాదుల రాక తమ సంతరణసాధనమని యెంచి సకల సప

ర్యల నొనర్చుచుఁ దమ తమ సంస్థానములకుఁ దీసికొని పోవుచుండిరి.

అంత గొన్ని దినములకుఁ బుణ్యతీర్థములకును పావనంబులగు నదులకును, మహోన్నత గిరులకును, విద్వద్వతంసులకును నిలయమగు భారతావనిని ఒకపరి సవిమర్శంబుగ యాత్రచేసిన లెస్సగనుండునని తలఁచి యేదియో ప్రసంగమున ఉండ్రూరు జమీందారురాలితో ముచ్చటింప నామెయు వలయుధనమును సమర్పించుకొనెను.

నాఁడు మాఘబహుళ ద్వితీయ. భారతీంద్రులు ఒంటరిగానే భారతదేశ దిదృక్షాపరులై కాకినాడ పురమునుండి బయల్వెడలిరి. తొలుత విజయవాటిక (బెజవాడ) చేరి కృష్ణనవతరించి దుర్గను దర్శించి యటనుండి శ్రీగిరి కేగి ఆదిదంపతులగు భ్రమరాంబికా మల్లికార్జునుల దర్శనముచేసి యందుగల యోషధివితానంబులను బర్వతమహాత్మ్యంబును గనుగొని అటనుండి పూనా బొంబాయి పట్టణంబులకు వెడలి అందుఁ గల యాచార వ్యవహారంబులను మతాభినివేశంబునుగని యటనుండి గోదావరీ ప్రథమావతరణంబగు నాశికాత్ర్యంబకమున కేగి అట జలకంబులాడిరి. నామమాత్రంబుచేతనే తమకు ఉపాస్యంబగు నోంకారక్షేత్రంబునకు వెడలి అందు రేవాతరంగిణిఁ (గుంకి మహారాష్ట్ర) తేజంబునకు నిధానంబగు ఇందూరునకు నిర్గమించి అటనుండి చతుష్షష్టికళలకు ఆకరమై భారతదేశమునఁనేగాక దేశాంతరంబులందును ఆచంద్రతారకంబుగ మిక్కిలి కీర్తివహించి భర్తయగు విక్రమార్కుని వియోగముచేఁ గళావిహీనమగు నుజ్జయినీపురికి వెడలి అందుఁగల ప్రాచీన కార్యస్థానంబుల మహా

త్సాహంబుతోఁ దిలకించుచు, రాజపుత్రశౌర్యాగ్నికి నరణి యగు జయపురంబునకు విజయముచేసిరి. సింధునందలి హైదరాబాదున కేగిరి. నేఁటి దేశరక్షణమునకు సర్వసన్నాహములతో నొప్పుచున్నట్లు ప్రసిద్ధిగన్న కరాచిని అధిగమించిరి. లాహోరు వెడలి అందుఁగల యార్యసమాజ కలాశాలకుఁ బోయి అందు ఆర్యసమాజ నిర్వాహణదీక్షితు లెవ్వరైనఁ గలరా అని పృచ్ఛసేసి లేరని నుడువ అటనుండి అమృతసరసునకుఁ బోయిరి. అటఁగల విశేషములఁ దిలకించుచు మోక్షద్వారమగు హరిద్వారమున కేగి అందలి శుద్ధ జాహ్నవీ జలంబులఁ దీర్థమాడి అందుఁగల మఠంబులను యతులను వీక్షించిరి. గ్రామముగా గౌరవరాజన్యులకుఁ గార్యస్థానమగుచు నేఁటివఱకు భారతదేశమునఁ బ్రధాన నగరము నాఁబడు ఢిల్లీనగరము నారసి కైవల్యదాయినిగగు మధుర దర్శించి తమ యాదిపురుషుండగు నారాయణుని పాదనిధానంబులచేఁ బవిత్రమైన గోకులబృందావనంబుల సంచరించి పాదుషాల మహాభోగంబులఁ బ్రకటించు జగద్విఖ్యాత వస్తుసంచయముతో నొప్పు ఆగ్రానగరంబువిలోకించి ప్రయాగ సేవించి త్రివేణి మునిఁగి అపవర్గప్రకాశయగు కాశిఁ బ్రవేశించిరి. అందలి పండితసందోహములను మఠములతీరును మస్క-రుల పుష్కరతత్త్వంబులును దేశాచారవ్యవస్థలను అవగాహనము చేసికొని ప్రత్యహంబును భాగీరథీపుణ్యోదకంబుల జలకములాడుచు విశ్వేశ్వరుని భజించుచుఁ గొన్ని దినంబులు గడపిరి. పితృతీర్థంబగు గయాక్షేత్రంబునుఁ జూడఁదలఁచి గయ చేరి అందలి గయావలీల నీచకృత్యంబులకు రోసి కాళికా స్థానంబగు కలకత్తాచేరి కాళిఁగొల్చి నీలాచలంబున జగన్నా

ఘుని పాదాంబుజంబులకు మ్రొక్కి మఱలఁ గాకినాడపుర మునఁ బ్రవేశించిరి

ఇట్లు తీర్థయాత్రలను ముగించి వచ్చునంతలో మఱలఁ బీఠికాపురమున బ్రహ్మసమాజము రేకెత్తుటఁ గాంచి అద్దాని నణఁచుటకు 1909, 10 సంవత్సరములు తత్పరిసరములందే సంచరింపవలసి వచ్చెను.

ఇది యిట్లుండ దివ్యజ్ఞానార్య సమాజాద్యవైదిక మతములు కుక్కరధ్వజంబులట్లు అంకురింపఁదొడఁగినవి. అవ్వానిలో దివ్యజ్ఞానసమాజము అన్నెభసతీ యుపజ్ఞమై ఉన్నతోద్యోగి సమాశ్రితముకాఁజొచ్చెను. అయ్యమ తన వాగ్జాలంబుల వారలఁ గ్రుంగఁదీసి భగవంతుఁడు దనమతముద్ధరింప నవతరించెననియు, ఆతనిరూపము తన హృద్గతమయ్యె ననియు, అనుయాయులతో ముచ్చటించుచుఁ దుదకు నొక బాలునిఁజూపి అతఁడే యా మహానుభావుఁడనియు ఆతని పాదోదకమే గంగోదకమనియుఁ బవిత్రతమగు నార్యావర్తమున సాధుజన సంక్షోభము చేయమొదలిడెను. అద్దానిని సహింపజాలక బాలభారతీంద్రులు"Theosophy Unveiled" అనునొక విపులమగు వ్యాసము వ్రాసి ప్రకటింప అయ్యమ శ్వేతపటచ్ఛన్న ముఖయై ఊరకున్నను దాముమాత్రము అద్దానిని బాగుగాఁ బ్రకటించి సంపూర్ణాహుతికై తగుసమయము ప్రతీక్షించుచుండిరి.

ఇది యిట్లుండఁ దమ పూర్వతీర్థయాత్రయందుఁ గొన్ని తీర్థములు అవశిష్టములై ఉండుటచే అక్కటంత తీర్పసంకల్పించి తమ శరీరము రుజాగ్రస్తమైనను 1912 మాఘబహుళ ద్వితీయనాఁడు బదరికాక్షేత్ర యాత్రకై బయ

ల్వడలి వ్యాధిని సరకుగొనక హరిద్వారము చేరి యట నుండి బదరికయందుఁ బ్రవేశించిరి. అందుఁ దమ పూర్వ పురుషుల యాశ్రమంబులను వీక్షించుచుఁ గొంతకాల మచటనే ఉండిరి. క్రమముగా వారి యారోగ్యముగూడ బాగుపడఁజొచ్చెను. అటనుండి అధికాషాఢ పూర్ణిమనాఁటికి మఱల ఆంధ్రదేశమునకు వచ్చి జనపదంబులయందలి జిజ్ఞాసువులకు భాష్యప్రవచనము సేయ మొదలిడిరి.

"ఆరబ్ధముత్తమ గుణా నపరిత్యజన్తి" అనెడి సూక్తి సర్వవిధముల భారతీంద్రులకడఁ గడలుకొన్నది. వారెట్టి కార్యము నారంభించినను అద్దాని పారమును గనుగొనవలసినదే! ఆరంభమునఁగాని మధ్యయందుఁగాని అద్దానిని బరిత్యజించుట వారికిఁ గలయందైన లేదు. కావున ఇంతకుమున్నె సామిహతంబగు దివియజ్ఞాన సమాజమును బూర్ణముగ హతమార్పఁ దలఁచిరి. ఆనాఁడు దివి యజ్ఞాన సమాజ వార్షికోత్సవములను ఆబ్దిక కార్య నిర్ణయములను ఏటేటఁ గాశికాపురియందు జరుపుచుండెడివారు. దానిని దెలిసికొని ఆ సమావేశ సమయమునకు శ్రీవారు కాశికాపురి కేగి వారలను బ్రత్యక్షమున నెదుర్కొనఁగా వారు తమతమ సభలను ఏరికిఁ దెలియకుండ రహస్యంబున ఏర్పఱచుకొనుచు నెట్లో ఆదినంబులను గడిపిరి. ఎన్నివిధంబులఁ బ్రయత్నము చేసినను ఆసభ్యులు పలుకకుండుటచే అవ్వారలు గోష్ఠీనర్హులుగా భావించి ఆమతము ఎంతమాత్రము క్షోదక్షమము గాని సప్రమాణముకాని కాదనుచు "ప్రపంచహితసందేశము" Message to the world ఒకదానిని బ్రకటించి "దివ్యజ్ఞాన సమాజ భయంకరులై" ఒప్పిరి.

ఇట్లు 1914 సంవత్సరము గడుప 1915 సంవత్సర చైత్రమాసమున శిష్యజన ప్రార్థనముపై వరంగల్ నగరమున కేగి అందుఁ గొన్ని దినములు ముముక్షు జనతారకంబులగు నుపన్యాసంబుల నొసంగుచు అచటి శిష్యజనముల కందఱ కును బంచదశితోఁగూడఁ బ్రస్థానత్రయమును శాంతి చేయించిరి.

ఇంతలో అద్వైతానందతీర్థుడను నొకకర్మంది తానే బ్రహ్మభూయము నొందినవాఁడనను నవలేపమునొంది శంకర కృతభాష్యరాజంబులు సరిగావనుచు నేవేవియో ప్రలపించు చుండెను. అద్దానిని నేనే ఖండింపఁగలాఁడ నను నాహోపూ పురుషికతో మల్లాది రామకృష్ణాధ్వరి అతని నెదుర్కొన నా యిద్దఱును సతతము కలహించుచుండిరి. ఇట్లు కలహించువారు ఊరకుండక ఎచ్చటనో శిష్యగణములకుఁ బ్రవచనము గావించు భారతీంద్రులపైఁబడి కొన్ని యసంబద్ధాలాపంబులనాడిరి. దాన భారతీంద్రులు కతిపయ సమాధానముతో ఆ శుష్కమస్కరిని బరాభవించి అధ్వరికి 'అహంకారధ్వంసిని' యను పత్రికా ముఖమునఁ గొన్ని సమాధానంబులఁ జెప్పఁ గయ్యమునకుఁ గాలుద్రవ్వినవా రిరువురు తగు ప్రాచిత మనుభవించి వెడలిరి. అనంతరము 1916 వత్సరమున, శివపురపు వీరభద్రపాకయాజి ప్రభృతులకు సికంద్రాబాదునందు సూత్రభాష్య మధ్యాపనంబు గావించి యటనుండి క్రమముగా గోదావరీమండలమునకు విచ్చేసి భీమవరపుకోటయను గ్రామమున 1917 వత్సరమున శివరాత్రియందుఁ గామేశ్వరప్రతిష్ఠ సేసిరి. అప్పుడే దాని సమీపమునందలి గ్రామమగు కొప్పాక యను గ్రామ

మున జీర్ణదేవళము నుద్ధరించి శ్రీవిద్యాశంకరప్రతిష్ఠ అందుఁ గావించిరి.

ఆ సమయముననే చాతుర్మాస్య దీక్షయందు కొప్పాక గ్రామమున సూత్రభాష్యమును అధ్యాపనంబు గావించుచు అందలి పూర్వమీమాంసామత విచారణచేయ మొదలిడిరి. బాల్యమునుండి యాగములను అతిశ్రద్ధతో గమనించు చుండుటచే ఆ యాగమునందలి పక్షాన్తరములను వికల్పములను దలఁచు విచారించుచుండిరి. అందు నేఁటి కాలపు శ్రౌతులకు యాగవిషయములందుఁ బెక్కు-సందేహములు తోఁచుటచే అవ్వానిని నివారింపఁదలఁచి వెంటనే శ్రౌతసూత్రంబులను సమగ్రముగ అవగాహనము చేసికొని ఇంకను దమకుఁగల సందేహములను బోఁగొట్టుకొనఁదలఁచిన వారై శ్రౌతిరత్నమని పేరుగాంచిన నూకల వేంకటసోమయాజులు అనుసతనిఁ బిలిపించి ఆతని సాహాయ్యమునఁ దత్సంప్రదాయములను బాగుగ ఎఱింగి ఇంతవఱకు శ్రౌతులకు సందేహగ్రస్తములగు విషయముల విషయమై శాస్త్రీయ నిర్ణయంబులు గావించుచుఁ బ్రాయశ్చిత్తము తెలుఁగక చిక్కు-పెట్టు కొన్ని దోషములకుఁ బ్రాయశ్చిత్తంబులను శాస్త్రానుసారముగ నిరూపించిరి. ఇట్టి విచారణసందర్భమున సామాన్యముగ యాగమును జేయఁ దొలుతఁ జెప్పు సంకల్పమును ఆ శ్రౌతిపుంగవుఁడు --

"విచ్ఛిన్న సోమపీథ సంధానార్థం ఐంద్రాగ్నం పశుం, దౌర్బ్రాహ్మణ్య నిర్హారణార్థం ఆశ్వినంచ పశుం అగ్నీషోమీయేన పశునాసహ ఉపాలంభం కుర్వన్ సోమేన యక్ష్యే" అని చెప్పి పశుత్రయోపాలంభన సంప్రదాయమును నుడివెను.

అంత కుమారభారతులు సంకల్పమునందలి దార్బ్రాహ్మణ్య స్వరూప మెట్టిదని విచారించి కులక్రమముగ అధ్యయనము చేయువారికి దార్బ్రాహ్మణ్య మెంతమాత్రము లేకపోవుటచే అట్టివారు ఐంద్రాగ్న పశువిశసనము చేసినను ఆశ్విన పశువిశసనము చేయనవసరము లేకపోవుటచే అట్లు చేయఁగూడదేమో అని సందేహించి శ్రౌతసూత్ర వ్యాఖ్యానంబులను ధర్మశాస్త్రంబులను కృత్స్నంబుగ విచారించి కులక్రమాగతాధ్యయన సంపన్నులకు దార్బ్రాహ్మణ్యము లేకపోవుటచే అన్వార లీ పశువులను అధికముగఁ జంపుచున్నారని నిర్ణయించిరి. ఇట్టి మహావిషయమును దక్షుఁగల శ్రౌతులతోడను బండితులతోడను జర్చించి ఆశ్విన పశువిశసనము అశాస్త్రీయమని నిర్ణయించిరి. ఇట్టి నిర్ణయప్రకారము తామొక భూసురునిచే శాస్త్రీయంబుగ యాగమొకదానిని జేయింప సమకట్టి 1918 సంవత్సరమున శ్రౌతప్రక్రియయందుఁ గృతహస్తులగు యాజకుల రప్పించి యాగమొకదానిని సశాస్త్రీయముగఁ జేయించిరి.

అంధగోలాంగూలన్యాయమున ఇట్లువచ్చు నధికపశ్వాలంభము అశాస్త్రీయమని భారతీంద్రులు రుజువుచేయఁగా దేశమున ఒకమహాకలకలము బయలుదేరెను. అందు దార్బ్రాహ్మణ్యమును దమయం దారోపించికొని తృతీయపశువును వధించిన సోమపీథులును, భారతీశ్రీచరణుల యశమునకు ఈర్ష్యాపరులగు శ్రౌతిపండితమానులును ప్రధానులు. శ్రీవారి నిర్ణయ మశాస్త్రీయమని నిరూపింప సభగావింతుమని ఒక కొందఱు విజయనాగరమునకుఁ బ్రగల్భించియు శ్రీవారు అద్దానికి వత్తురను భీతిచే వెఱొకప్పుడు శ్రీవారికి అందుఁ

ప్రవేశము లేకుండునట్లు దగునియమముల నేర్పఱచి శ్రీ నోరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి యాధిపత్యమున ఒకసభచేసి ఏవియో, కొన్ని తీర్మానములను అందుఁ గావించిరి.

ఇట్టి తీర్మానములను సహింపక శ్రుతిస్మృతి సదాచార ప్రమాణులగు పండితబృందము వేఱొకసభను దప్పక గావించి న్యాయోపేతంబు లగు నిర్ణయంబులఁ గావింపవలయు నని భారతీచరణులఁ గోరిరి. అంత వారును బండితాభిమతాను సారముగ శ్రౌతవిచారణసభ నొకదానిని రాజమహేంద్రవర మున జరుపనిశ్చయించి అవ్విషయమును అశేషసూరిలోకంబు నకును, యాయజూకసముదయంబునకును దెలియఁబఱచుచు ఆహ్వాన పత్రికల నంపిరి. ఆపరిషత్తునకుఁ దార్కిక పంచానను లగు ఆదిభట్ల రామమూర్తిశాస్త్రిగారును, గతవిజయవాడ పరి షత్తునకుఅధ్యక్షులగు వైయాకరణకేసరి నోరి సుబ్రహ్మణ్యశా స్త్రిగారును సుధీపుంగవులగు అయ్యగారిరామావధానిగారును ప్రాడ్వివాకులుగా నియమింపబడిరి. మహామహోపాధ్యాయ సుబ్బారాయశాస్త్రిగారు విషయప్రదర్శకులుగ నిశ్చయింపఁ బడిరి. ద్విజకార్యంబగు యాగంబునందలి ప్రధానవస్తువగు పశువుతో ఇయ్యది సంబంధించినదగుటచే ఆనాఁటి సమస్య షడంగపారగులగు విద్వద్గ్రామణులతోడను యజ్వలగు యాజకులతోడను గేవల సోమపీథులతోడను, యజుస్సా మర్గ్వేదులగుఋత్విక్స్తోమముతోడను శ్రోత్రియసముదయంబు తోడను మిగుల దర్శనీయమాయెను. అంత భారతీకుమారుల యాచార పరీక్షా సభప్రారంభమాయెను. శ్రీ సుబ్బా రాయశాస్త్రిగారు సోమపుల యాచారభేదములఁ బ్రదర్శించి శ్రుతిసూత్రసమన్వయముచే ఆశ్వినపశ్వనావశ్యకతను నిరూ

పించుచుఁబూర్వము విజయవాడయందు జరిగిన నిర్ణయములు అశాస్త్రీయములని శ్రీనోరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారిసమక్షము ననే నిర్ణయించిరి. శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ఊరకుండిరే గాని లోఁగడ తాము చేసిన నిర్ణయములకుఁ గల యుప పత్తులనుగాని ప్రకృతము సుబ్బారాయశాస్త్రిగారిచే నిరూ పింపఁబడిన తమ వాదమునందలి దోషములకును వారిచేఁ జేయఁబడిన శ్రుతిసూత్రయుక్తి నిర్ణయములకును అనుప పత్తులనుగాని చూపలేదు. కావున నధికసంఖ్యగల ప్రాడ్వి వాకులు సమగ్రమగు నైకకంఠ్యమున ఆశ్వినపశ్వనావశ్యక త్వమును నిశ్చంచి తీర్మానములఁ గావించిరి.

ఇట్లెన్ని యోనాళ్ళనుంశి శ్రౌతమార్గమునఁబడియున్న యీ దుష్టకృత్యంబును లోకమునకు వెల్లడించి యజ్వలను యాజకులను నిరయము నొందకుండఁ గాపాడిన శ్రీ భార తీంద్రుల యశోజ్యోత్స్న దిగంతములఁ బ్రాఁకెను.

ఇట్లు ధర్మసంస్థాపనముచేసిన యనంతరము దక్షిణ దేశ తీర్థ దిదృక్షాపరులై కాకినాడనుండి ఽధ్యయన సంప న్నులగు నిద్దఱు విప్రోత్తములతో బయల్వెడలి త్రోవలో దక్షిణదేశమునందలి మహానగరంబులకును, శిష్టాచార సంప న్నములగు జనపదంబులకును ఏగుచు అటఁగల గొప్ప గొప్ప శ్రౌతులతో శ్రౌతవిచారముగావించుచుఁ దమపాండితీ విభవముచే అవ్వారలను ఆశ్చర్యపఱచుచుఁ గ్రమముగా సేతువునకేగి మఱలఁ గొన్ని నెలలకుఁ గాకినాడపురమునకు విచ్చేసిరి.

నాహారతుష్టి నొందుటఁగని కొందఱు భూసురులు తమ యభి శ స్తియందు విరక్తులై తత్కాలంబునకు మాత్రము సర్వకర్మ సంన్యాసంబును బడయఁదలంచి ఉపవీతంబును గటిప్రదేశం బు పైకి రానీయక నాపి తునికిఁ దమ కేశజాలమును మాత్రమే భృతిగాయిచ్చి కొన్ని బొమ్మల సంపాదించు కొని, కొందఱు సహచరులగు నవనీసురచక్రవర్తులు వెంట రాఁగాఁ దమ కుహనాసంన్యాసిత్వమున లోకమును బ్రతా రణ సేయుచుఁ దత్కాలోచిత పీఠాధిపతులై సర్వశరణ్యం బగు నైజామురాష్ట్రము నవతరించి మాసత్రయము సంచ రించి సంపాదితమగు వస్తుసంచయమును విభజించుకొని ప్రియావిరహవ్యథాపీడితులై తురీయాశ్రమవేషంబును ఉప సంహరించి తమ తమ నెలవుల కేగుచుండిరి. విచ్ఛిన్న సంప్ర దాయంబులగు నామమాత్రపీఠంబులకడఁ జేరి కొందఱు ధర్మ ధ్వజులగు విప్రులు ధనమోహమున అవిదిత ధర్మాధర్మ కృత్యులై పీఠంబుల నియోగింపఁబడు సంన్యాసులకు బ్రహ్మ త్వము నిప్పించియు అందలి యమూల్యంబగు వస్తుసంచయ మును ఎల్లెనఁ గైంకర్యము సేసియు మిక్కిలి ధర్మోపద్రవము గావించుచుండిరి. ధర్మవ్యవస్థాపకస్థానంబుల గతియే ఒట్లుం డఁగా అవ్వానిచే ధర్మబోధ సేయఁబడు జనులవృత్తి యెట్లుం డునో వేఱ వ్రాయనక్కఱ లేదు గదా! మూఢవిశ్వాసము గల సామాన్యజనులనుండి కొల్లఁగొట్టఁబడిన విత్తసంతతి యంతయుఁ బీఠమందిరములందు మూల్గుచుండఁ గని తమ పుత్రులనో పౌత్రులనో సింహాసనాధీశ్వరులఁ జేయ నెంచి పీఠాశ్రితులగు బ్రాహ్మణబ్రువులు అందఱును బడవలసిన పాట్లు పడుచుండిరి.

ఇఁక లౌకికవృత్తులఁ జూచినచోఁ జెప్ప వలనుపడదు. జనసామాన్యము ధనమే ప్రధానమని యెంచెను గాని నిధనంబు వెనుక తన గతియేది యని చూడలేదు. శాస్త్రవాదోపవాదంబుల జిగీషాతత్పరులగు పండిత ప్రకాండులయందుఁ గ్రమముగా శాస్త్రోత్పత్తిని దానాన్వేషణంబును, దత్త్వవిమర్శనా చాతురియుఁ గుంటువడఁజొచ్చెను. దీనికిఁదోడు పాశ్చాత్య విమర్శకులందఱును ఆత్మప్రాశస్త్యంబును ప్రకటించు విధమున మన వాఙ్మయమును విమర్శింపఁదొడఁగిరి. అవ్వానినే ఆబాలభావము మిగుల విశ్వాసముతోఁ బఠించిన మనవారల శోణితనాళములందు ఆయాయిసిద్ధాన్తములు ప్రవేశింప 'మోక్షమూలరు' ప్రభృతుల వాగ్యాథార్థ్యము శ్రుతికిగూడ లేకపోయెను. సంప్రదాయసిద్ధమగునంత ర్వాణివతంసుల శాస్త్రాధ్యాపనంబుకంటె అప్రాచ్యుల భాషా విపరిణామములందే గొప్పదనము చూపట్టెను. శ్రుతి శిరస్సిద్ధాన్తంతములందు సైతము వారి వాక్యములకే స్వతః ప్రామాణ్యము చేకూరెను.

ఇఁక ఐహికాముష్మిక నిశ్శ్రేయసంబులందుఁ బ్రధాన సాధనంబగు నుపాసన విషయమును బరికించితిమా అయ్యది అవైదిక సరణిఁబొంది యెట్టివారికైనను భీషణరూపమునఁ బ్రత్యక్షమగుచుండెను. దక్షిణ కౌళస్థానంబుల రెండింటిలో అగ్రవర్ణదూష్యంబగు కౌళమే శిష్టాభిమానులచే ఆశ్రయింపఁబడినది. అయ్యది మత్స్యభోజులగు నేత్రరాహ విద్వాంసులచేఁ దమ మత్స్యభోజనమునకుఁ బ్రామాణ్య ప్రఖ్యాపనంబునకై ఆశ్రయింపఁబడి క్రమముగాఁ దమయన్తేవాసి గణమునకు నుపదేశింపఁబడుచుండెను. గురువాక్య

శ్రుతిబుద్ధులగు ద్రవిడ పండితులు సైతము సత్యాన్వేషణ పరులుగాక దక్షిణ తంత్రంబుల నన్నిటిని ద్రోసిపుచ్చి పరశు రామసూత్రమే ప్రమాణ రాజమనియు భాస్కరుండే సదాచార ప్రవర్తకుండనియుఁ దలఁచుచు మపంచక సేవలతో తమ సత్సంప్రదాయమును బరశురామప్రీతిగా నొసర్చిరి. శిష్టాచారమునకు ఆదర్శప్రాయులగు పండితులే యిట్లు పదా ర్థంబులను ఉపాసనావిధుల గ్రహించుట గని అతఃపూర్వము తత్తద్వస్తుసేవనముచే దూష్యులనియుఁ బంక్తిబాహ్యులనియు బేరుగన్న పురుషులుగూడఁ దమ వ్యసనంబులకు నిగ్రహా తము లేకుండఁగనే తమకు శిష్టత్వమును సంపాదించు సత్సం ప్రదాయము లభించినది గదాయని సంమోదమున నొంద మఱునటిదినమునుండియే యట్టివారి యిండ్లు పరిసరస్థాను కూలంబులగు దేవతా విగ్రహంబులు వెలసినవి. క్రమముగాఁ దత్తద్వస్తు విక్రయశాలలన్నియు శిష్టజన సంసేవ్యములైనవి.

ఇఁక వర్ణవ్యవస్థఁ జూతము:—కాలవాహినీ సమాంపతి తంబులగు కొన్ని దోషంబులను అట్లుండ నిచ్చినను పాణిపీడ నాదికంబులుగూడ వర్ణాంతరములతో బయల్వెడలినవి. అందు నను బ్రహ్మర్యాదివియుజ్ఞాన సమాజముల మూలమున జన సంఘాతము లన్నియు అనివార్యం బగు స్త్రీ పురుష భేదమునే గైకొని వర్ణవ్యవస్థ విడనాడి సమజము లయినవి. అట నట నామమాత్రద్విజులు తమ ధర్మములందు విశ్వాసరాహిత్య తీర్మానమును గావించుకొని తమ పుత్రులను బ్రాహ్మ్యశిఖా మణులుగఁ దయారుచేయఁ మొదలిడిరి. అచిరకాలమునుం డియే పాశ్చాత్య దుర్గంధపూరితంబులగు నీ జనహృదయాంధు వులు గీర్వాణభాషాసుమగంధమును దరిఁ జేరనీయక పోయి

నవి. ఇట్టి దుర్భరంబగు దురవస్థ ఆనాఁటికి సంపూర్ణప్రాయ మాయెను.

వైదికసామ్రాజ్యమునకు ఇట్టి సంకటసమయము సమీపింపఁ బెచ్చుపెరిగిన మచ్చరంబుతోడ ద్వైత విశిష్టాద్వైత మతంబులుగూడ ఈ యౌపనిషదంబగు నద్వైతంబును దూఱ నారంభించినవి. ద్వైతాదిపీఠస్థులమాట కాలవశమునఁ జలామణి యగుటచేతను బ్రతిఘటింప నిల్వఁగల సాహసాదికము పీఠాధిపతులకు లేకపోవుటచేతను, ఇంతమాత్రముననే మేరుసుస్థిరంబగు నద్వైతంబునకు ఏమి భిన్నంబైనదను విపక్షుల యుపేక్షాభావముచేతను ఆ యవైదికవాదములు వృద్ధిపొందినవి.

అట్టిసమయాన భారతీంద్రులు పీఠము నొక పరిచిత దేశమున స్థాపించి తాము క్రమముగా భారతదేశమున దిగ్విజయయాత్ర సేయ నెంచిరి. కావునఁ బీఠమునకు నింతవఱకుఁ బరిచితంబులగు గోదావరీ విశాఖపట్టణ మండలములలో నెందైనను బీఠమును స్థాపింపఁదలఁచిరి. కాని ఆనాఁడు గుంటూరునగు శిష్యస్తోమమునందుఁ బ్రధానులగు శ్రీ పొన్నాడ రామకోటి సాగర్వాలా రుస్తుంసింగుగారలు ఎట్లైన శ్రీ పీఠమును గుంటూరునందే యుంచి ఆ కీర్తి గుంటూరుకే రావింప వలయునని వేఁడుచు అద్దానికి అనుకూలంబులగు నివేశనంబుల నేర్పఱచిరి. జగద్గురువులును దాన గుంటూరినే వైదిక సామ్రాజ్య కేంద్రస్థానముగ నేర్పఱచి అటఁ దొమ్మిదిమాసములు శ్రుతిశిరస్సుల నధ్యయనంబు గావించిరి. అవకాశము సరిగా లేకపోవుటచే అయూరఁ బీఠస్థానమునకు ననువగు సదనంబుల నిర్మింప వలనుపడదాయెను. సామాన్య రాజ్య

పరిపాలనమునకువల్లె మంత్రి కార్యదర్శి కోశరక్షకుఁడు రాజసన్నిధివర్తి కార్యాలోచక సంఘము లేకరులు మున్నగు వారల సమవాయము ప్రకృతకాలమునందు వైదిక రాజ్యపరిపాలనమునకుఁ గూడ అవశ్య వ్యవస్థాప్య మని యెంచి జగద్గురుచరణులు వైదికమార్గానుయాయులగు సచివాదివర్గము నాయత్తపఱచిరి. ధర్మవ్యవస్థాపనమే ప్రధాన కార్యముగా నెంచిన తాము ఎటకేని యేగవలసి వచ్చినచో సముదంచిత పరివారముతోడనే దిగ్విజయము చేయవలయునుగాని లేనిపోని యాడంబరముల నవలంబింపఁ గూడదని నిర్ణయించిరి. శ్రీవారు తమ దిగ్విజయయాత్రా సమయంబులందుఁ బ్రధాన శ్రీచక్రంబును గార్యస్థానముననే యుంచుట మంచిదని తలఁచి తమతో నిత్యార్చనమునకై గొంపోవుటకుఁ జక్రపరిమాణంబులను శాస్త్రీయంబుగ నిర్ణయించి శుభముహూర్తమున ఒక శిల్పిచే అష్టనాగేంద్ర సంయుత శేషాహిసమవేతకూర్మచక్రంబుతో సమలంకృతమైన శ్రీ మహాకామేశ్వరీ యంత్రరాజంబును ఒకదానిని రక్తాక్షి వత్సరాశ్వయుజశుద్ధప్రతిప దిందువాసరంబున (29–9–24) బ్రతిష్ఠ చేసిరి.

పీఠకార్యములకు వలయు సౌధములు నాఁటికి గుంటూరుపురమున నిర్మింపబడకపోవుటచేతను గార్యనిర్వాహకవర్గమంతయుఁ దెనాలియం దుండుటచేతను దాత్కాలికముగఁ బీఠ కార్యస్థానము భాద్రపద బహుళ ద్వితీయనాఁడు తెనాలికి మార్పఁబడియె.

అనన్తరము పీఠలౌకిక కార్యసమాలోచనమునకై మద్రాసునగరము శ్రీవారు వెడలఁగా నచటి న్యాయవాది

వర్గము భారతీంద్రుల యుపదేశానుసృతము పరంపరగాఁ జవి గొన్నవారే యగుటచేఁ గొంత జ్ఞానబోధ సేయు వేడఁగా నట మంత్రశాస్త్రమును గూర్చి గొన్ని యుపన్యాసంబులు గావించి యటనుండి నెల్లూరు పౌరప్రముఖుల ప్రార్థనపై నెల్లూరఁగూడ వేదాన్తోపన్యాసంబులను మంత్రశాస్త్రోపన్యా సంబులనుగూడఁ గావించుచుండిరి. ఇట్లు క్రమముగా యావ దాంధ్రదేశమును సంచరించుచు తాము మెట్టిన ప్రదేశంబున నున్నవారలకు సర్వదా మంత్ర శాస్త్రోపన్యాసంబులను ప్రస్థాన త్రయాధ్యాపనంబును గావించుచు సర్వత్ర వైదిక ధర్మపరిషత్తుల నెలకొల్పుచుండిరి.

ఇట్లుండ గంజాము విశాఖపట్టణ మండలంబులయందుఁ గొన్ని కృత్రిమపీఠములు బయల్వెడలినవనియు నందొకటి అభినవ విరూపాక్షమనుపేర విజయనగరమునకు వచ్చి ధర్మ విప్లవకరంబులగు కార్యంబులను జేయమొదలిడినదనియు దానఁ గొన్ని యనర్థంబులను వాటిల్లుచున్నవనియుఁ గావునఁ దామెల్లైన విజయనగరమునకు విజయముసేసి ఈయనర్థంబుల దూరీకరింప ననుగ్రహముసేయవలయుననియు విజయనగర శిష్యవర్గము నెల్లూరు నగరముననున్న శ్రీవారికి నివేదించు కొనిరి. దానిపై ఆచార్య శ్రీపాదులు అయ్యది చాతుర్మాస్య దీక్షా మధ్యసమయమగుటచే బయల్వెడల వలనుపడ లేదనియు దీక్షాసమాప్తి అయిన వెంటనే తాము వేంచేయుదుమనియుఁ దెలిపి అనుపదముననే ఆపీఠమును బహిష్కరించి నట్లొక బహిష్కారశాసనము విజయనగరమునకు పంపిరి. అనంతరము దీక్ష ముగియఁగా శ్రీచరణులు తగు పరివారముతో 7-10-25 తేదీయందు నెల్లూరునుండి విజయనగరమున కేగఁగా

భక్తులందఱు "స్టేషను"దగ్గఱ భారతీంద్రులకు స్వాగతమొసఁగి అత్యుత్సాహమునఁ బట్టణమునకుఁ దీసికొనివచ్చి తగుసౌధము నివాసముగా నేర్పఱచిరి. కాని యప్పటి విజయనగరపరిస్థితి చాల యల్లకల్లోలముగానుండెను. నగరప్రభువగు నలకనారా యణ గజపతీంద్రుఁడు దనరాజ్యమును సర్వాధికారములతో మంత్రికి నొప్పగించి దాను విదేశయాత్రాభిలాషతో శ్వేత ద్వీపమున కేగెను. నగరమునందలి జనసామాన్యమంతయు ఆస్థానమే యాధారముగాఁ గల్గియుండుటచే ఏమిచేయుటకును ఆస్థాన ప్రధానోద్యోగులకు వెఱచుచుండిరి. ఇంతలో ఆ నూతన పీఠానుచరులు కొందఱు తమ యునికికి ఇఁక నాధా రము లేమింజేసి ఏవియో కొన్ని కుటిలోపాయముల నవలం బించి ప్రధానోద్యోగులను వశీకరించిరి. ఇట్టి చర్యలచే నుచటి స్మార్తజనములోనే విరోధము దినదినాభివృద్ధిఁ గాంచ మొద లిడెను. ధర్మపరు లందఱును ఈ విరోధములవలనఁ దమ జీవి కలకు నెద్దియేని భంగము కలుగు నేమో యని భయపడఁ జొచ్చిరి. అంత శ్రీపీఠాధీశ్వరులు పురియందుఁ గల్గుచున్న ధర్మగ్లానిని గాంచి తాము కొంత ధర్మబోధ సేయ నెంచి ..రు వదియేడు విషయములనుగూర్చి నలువదియెనిమిది దినములు అనన్యసామాన్యముగ నుపన్యసించి ప్రత్యేకముగ బ్రహ్మ సూత్రసారమును మఱికొన్ని యుపన్యాసంబులచే బోధించి నాగరులను ధర్మరక్షణదీక్షాదక్షులుగ నొనర్చిరి. దాన నగర వాసు లందఱు జడితీఱి శ్రీపీఠాధీశ్వరులను సర్వవిధములఁ బూజింప మొద లిడిరి. ఇట్లు విజయనగరమున నెనిమిది మాసము లుండి ధర్మవిప్లవమును అణఁచి పండితబృందముచేఁ సకలసమ్మానంబులను గొనుచు అఖండతేజంబులఁ బ్రకా

శించుచుండిరి. ఆ సమయముననే భక్తుల ప్రార్థనముపై సకల మంత్రకూటస్థానంబును త్రిపాద్విభూతి నారయణోపనిషత్ప్రతిపాదితంబును అగు మహానారాయణయంత్ర మొక్కటి శ్రీమత్త్రిపాద్విభూతి నారాయణవిధి ననుసరించి విశాలం బగు పత్రంబునఁ బరిలేఖనము చేయఁబడియెను.

ఇది యిట్లుండ దేశమునందలి గణకులలోఁ గొందఱు స్వధిషణా విశేషంబులఁ బ్రదర్శింప నెంచి పంచాంగంబుల గుణియించుటలో శిష్టసమ్మతంబగు సనాతనసరణిని ద్యజించి పాశ్చాత్య నిర్ణయవాసనా దూషితులై ప్రత్నపద్యల ననుసరించుటచేఁ బంచాంగములలోఁ జాల విప్రతిపత్తులు బయల్వెడలినవి. ఆ సమయమున దేశమునందుఁ గ్రోధన వత్సర ఫాల్గున మధిమాసమా లేక క్షయాబ్ద చైత్ర మధిమాసమా యను సంశయమున రెండు వీధులనుండి రెండు వాదములు విజృంభించినవి. అవ్వానిలో నెయ్యది శాస్త్రీయమో నిర్ణయింప విశాఖపట్టణమున జయపురాధీశ శ్రీ రాజా విక్రమదేవ భూపాలుఁడు మున్నగువారు ఒక పరిషత్తు నేర్పఱచి సకల గణక లోకము నాహ్వానించిరి. అద్దానికి శ్రీవారిని అగ్రాసనాధిపత్యము వహింప వేఁడఁగా వారద్దాని నంగీకరించి సభను జయప్రదముగ నిర్వహించి తుట్టతుదను "వైదిక కర్మార్హతిథ్యాదికమును సూర్యసిద్ధాన్త సమ్మతముగనే సాధించుట సదాచార సిద్ధమగుటయె గాక నిబంధనకర్తలచే నొక్కి వక్కాణింపఁబడి యుండుట చేతను బ్రకృత మనువదింపఁబడిన దృక్సిద్ధవాదము ప్రతిష్ఠితంబై సంశయాస్పద మగుటచేతను సూర్యసిద్ధాన్తముచేఁ దెలియవచ్చెడి యధిమాసము చైత్రమాసమని ప్రాచీను

లిదివఱకే గుణియించి యుండుటచేతను ప్రకృతము నక్షయసంవత్సర చైత్రమాసమును అధిమాసముగ నిర్ణయిం చుచు నేఁటివఱకు నవిచ్ఛిన్న పారంపర్య క్రమమున బహువిగ మజ్జులచే ననుసరింపఁబడియున్న సూర్యసిద్ధాంత సమ్మతమగు తిథ్యాదులనే శ్రౌతస్మార్త నిత్యనైమిత్తిక కర్మార్హముగ నను సరించుట శ్రేయఃప్రదమ"ని తీర్మానించిరి.

అనన్తరము తమ విజయయాత్రను భీముని పట్టణము మీఁదుగా సాగించుచు మధ్యేమార్గంబున మహోపన్యా సంబులఁ గావించుచుఁ గ్రమముగాఁ గేంద్రస్థాన మలంకరించి, ఆ కాలమున వైశ్యజాతిని అత్యంతము కలవరపఱచు "వైశ్య వేదోక్త క్రియావిచారవ్యవస్థ" యనునొక పత్రికను విమర్శించి తద్విషయమును దమ పరిషత్సభ్యులగు మహామహోపా ధ్యాయ సుబ్బారాయశాస్త్రిగారితోఁ జర్చించి వారలచేతనే తత్ప్రతికాఖండనపురస్సరముగ శ్రుతిస్మృతి సదాచారసమ్మత మగు " వైశ్యవేదోక్తక్రియావిచారవ్యవస్థ " యను గ్రంథ మును వ్రాయించి ప్రకటించిరి. తరువాతఁ దమ కేంద్రస్థాన మున నే గొంతకాల ముండి శిష్యవర్గంబునకు ఉపనిషద్భాష్యం బులను సూత్రభాష్యంబును మంత్రశాస్త్ర రహస్యంబులను గఱపుచుఁ బీఠసచివులలో నొకరి ప్రార్థనముపైఁ దమచేఁ బూర్వము భీమవరపుకోటయందుఁ బ్రతిష్ఠితుఁడైన సోమేశ్వ రుని యాలయమున కేగి దానికి 1927 సంవత్సరమున శిఖర ప్రతిష్ఠను గావించిరి. అటనుండి ప్రాంతసంస్థానంబులకు నగర ములకును ఏగుచు వాఙ్ముఖరూపంబున భక్తులను సంతరింపఁ జేయుచు వైదికధర్మరక్షణార్థము వైదికధర్మసభల నేర్పఱ

చుచుఁ గ్రమముగా ఆంధ్రదేశమునందలి ప్రాగ్దిశను విజయము గావించి 27—1—27 తేదికిఁ గేంద్రమునకు విచ్చేసిరి.

ఇట్లు దేశమునందలి పరిస్థితులను దమ విజయయాత్రల మూలమున గమనించి ధర్మవ్యవస్థాపనమునకై కొన్ని యీ దిగువనిర్ణయములఁ బ్రకటించిరి.

1. పరమహంసలకు జ్ఞానయోగముతోఁ గూడిన శంకర ప్రస్థానత్రయ భాష్యంబులును,

2. నిష్కామ కర్మయోగులకుఁ గర్మనిష్ఠతోఁ గూడిన శాంకరభాష్యంబులును,

3. ఉపాసనతత్పరులకు శుభాగమాను సార్యుపాసన క్రమంబును,

4. శ్రోత్రియులకు విద్యారణ్యభాష్యంబులు,

5. ఋత్విజులకు సవ్యాఖ్యాన శ్రౌతగృహ్యసూత్రంబులును,

6. వర్ణాశ్రమ ధర్మ జిజ్ఞాసాతత్పరులకు మనుయాజ్ఞవల్క్య గౌతమ ధర్మశాస్త్రంబులును,

7. చతుర్థవర్ణంబుల వారికిఁ బురాణోపాదానకంబగు జ్ఞానోపాసనా క్రమంబును,

8. స్త్రీలకు యథావిధి జ్ఞానమును,

9. తక్కుంగల భక్తులకు వలయు సద్విషయములును,

ఉపదేశింపఁబడునని ప్రకటింప అనేకులు యథేష్టంబుగ వారికి వారికి వలయు విద్యాధనము సేకరించుకొని కృతార్థులై వెడలుచుండిరి.

అనంతరము కొన్ని దినములకు గోదావరీమండలమున విశ్వరూప యాత్రసేయ నిశ్చయించి 14-9-27 తేదినాటికి రాజమహేంద్రవరమున కేగి 11-12 27 వఱకు నచట నే చాతుర్వర్ణ్యంబులకు హితమును గఱపిరి. అందు సాయం సమయములందు హిందూ సమాజము మున్నగు ప్రసిద్ధ స్థలములయందుఁ గొన్ని యమూల్యంబులగు నుపన్యాసంబుల నొసఁగుచుండిరి. తుదకు "ఈశ్వరాస్తిత్వము తత్స్వరూపము" "The teaching of Gita as manifested in the life of Sri Krishna" అను విషయములఁ గూర్చి ఉపన్యసించు నపుడు అంతకుముందు నాస్తికవాదన తాపపరీత మానసులగు శిష్టాచార సంపన్నుల హృదయంబులు సిద్ధరసాయనమును గ్రోలినవానివలె వికాసమునొందినవి. ఆ యుపన్యాస మహిమ యేమియోగాని రాజమహేంద్రపురవరంబున అవైదిక మతజీవనాధారులై వైదికమత బద్ధద్వేషులుగ ఒప్పు నాస్తిక శిరోమణులుసైతము తొలుత అవ్వానిని అసూయతో విన్నను తుదకుఁ దమ కరకౌశతరకంబులుడిగి శ్రీవారికి దాసానుదాసులైరి. ఇట్లు విరోధిగణముచేఁ గూడఁ బ్రశంసింపఁబడుచు భారతీంద్రులు అటనొక వైదికధర్మసభను స్థాపించి ఉపాన్త జనపదంబులందు ధర్మప్రచారము గావించి భక్తవరుల ప్రార్థనముపై నెల్లూరు బందరు పురంబుల కేగి యచట అధర్మోన్మూలన పూర్వకంబుగ ధర్మప్రచారము గావించుచు 26—4—29 నాఁటికిఁ గేంద్రస్థానము నలంకరించిరి.

కాని కలిప్రాబల్యమున ధర్మమును రూపుమాపుచు అధర్మము విజృంభించుచుండఁగా అధర్మోన్మూలన పూర్వకంబుగ ధర్మ సంస్థాపనము చేయనెంచిన మన శ్రీ చరణులకు విశ్రాన్తి యెక్కడిది? తెనాలి ప్రవేశించిన వెంటనే శ్రీవారిచే విజయనగరమున సర్వవిధములఁ బరాభవింపఁబడి నడిరేయి ఎటకో కాలిబుద్ధి సెప్పిన నూతన విరూపాక్షపీఠము నందలి కర్మంది కాకినాడవచ్చి ధర్మోపద్రవముసేయ మొదలిడెను. అద్దానిని అచటి ధర్మపరులు గని తాము సహింపలేక జరిగిన వృత్తాన్తమును శ్రీవారికి నివేదించుకొని యాతని దౌష్ట్యము తాము విజయముచేసిననే అణఁగదనియుఁ దాము విచ్చేసి ధర్మబోధ సేయకున్నచో ధర్మోపద్రవము హెచ్చును గావునఁ దామువచ్చి మమ్ముల నుద్ధరింపవలయుననియు వినతి పత్రికను పంపుకొనఁగా అద్దానిపై శ్రీవారు 1-10-28 దినమునకుఁ గాకినాడ పురికేగి నాల్గుమాసములట నుండిరి. ప్రతిసాయమునను రెండుగంటలసేపు అఖండముగ శ్రుతిస్మృతులఁగూర్చియు ధర్మంబులఁ గూర్చియు మహోపన్యాసంబుల నొసంగిరి. ఇట్లు ప్రచండ గభస్తి సహస్రంబులఁ గల్యాణచండభానుడు అధర్మత మిస్రంబుల రూపుమాపుచుండ ఏమూలలనో చిక్కి కొన్ని దివాంధములు వేదనా కూజితంబులను గూయఁదొడఁగఁగా నట్టి పక్షులను సరిగా నేర్చి కూర్చి పక్షంబుల ఖండించి సాటివాని దరిచేరకుండ ధర్మరక్షణ దీక్షితులు వెలిగావించిరి. శ్రీవారి ధర్మైకతత్పరతగాంచి అచటి వైశ్యబృందమంతయు శ్రీవారే తమకు సర్వవిధముల ధర్మబోధకములని యెంచి పాదసేవలొనర్చుచు దీర్ఘప్రసాదములఁ గైకొనుచుండిరి.

ఇట్లు కాకినాడ పురవరంబున ధర్మ విప్లవకారకుల సమాజంబును జాతుర్వర్ణ్యబహిష్కృతముగ నొనర్చి ధర్మ వ్యవస్థచేసి తమ కృత్యము నిర్వర్తితంబగుటచేసి శ్రీవారు అటనుండి వెడలఁ దలఁపఁగా దత్పౌరులందఱు వారియెడఁ గల శ్రద్ధాభక్తులను బ్రకటించుచు ఒక మహాసభ గావించి అందు శ్రీవారే తమకు సర్వవిధముల ఆచార్య శ్రీపాదులని ఘోషిచేసికొని అందులకుఁ దగు తీర్మానములనువ్రాసి మహా సభయందుఁ బ్రకటించిరి. ఇట్టి యప్రతిహతముగఁ గాకినాడ పురంబున దిగ్విజయముసేసి జగద్గురువులు అటనుండి కేంద్ర స్థానమునకు విచ్చేసిరి.

ఇంతవఱకు వ్యాఖ్యాన సింహాసనాధీశ్వరులచే ఆంధ్రా వనియందే ప్రధానముగ ధర్మబోధసేయఁ బడుచుండెనేగాని యితర దేశములందుఁ జేయఁబడలేదు. కావున వారు పూర్వ మొకప్పుడు సర్వవిధముల వైభవములతో నొప్పిన మహా రాష్ట్రదేశమునకు విశ్వరూప యాత్రసేయ నిశ్చయించిరి. వెంటనే వారు సముచితపరివారమును వెంటనిడుకొని 25-4-29 తేదియందు బయల్వెడలి వరంగల్ పురమునకు వెడలి అటఁ గొన్ని యుపన్యాసంబులనిచ్చి తత్పురమునుండి మధ్య పరగణాల రాజధానియగు నాగపురమునఁ బ్రవేశించిరి. అట మహామహోపాధ్యాయ కేశవరావు జీతానుకర్ ఎం. ఏ. మున్నగు బ్రాహ్మణ సభవారి ప్రార్థనముపై దత్తాత్రేయ మందిరమున వివిధంబులగు ధర్మంబులను సంస్కృతాంగ్లంబుల యందు ఉపన్యసించి ధర్మబోధ గావించిరి. అటఁ గొన్ని వాసరంబులుండి ధర్మబోధసేయుచు నర్మదాకూలంబుననుండు నోంకారేశ్వరు దర్శించి క్రమముగాఁ గేంద్రమునకు విచ్చేసిరి.

అంత మద్రాసునగరమున అఖిల భారతీయ సనాతన సభ నొకదానిని ఆపురప్రముఖులు జరుప నిశ్చయించిరి. ఆయ్యది యెవ్వరి యుపక్రమణమున జరుగఁగలదాయని ఆలోచించి భారతదేశమున ఏకైకధర్మవ్యవస్థాపకులుగాఁ గీరితి వహియించిన మన భారతీంద్రులే అద్దానిని నెరవేర్పఁ గలవారని విశ్వసించి ఆవృత్తాంతమును శ్రీవారి యంఘ్రిసరోజంబుల సన్నిధి విన్నవింపఁగా అద్దానిపై శ్రీవారు 26—11—29 తేదియందు ఆ కార్యమును నిర్వహింప మద్రాసు వెడలిరి. ఆమహానుభావుఁడు తమ గంభీరములగు వచనంబులతోఁ దమ యుపన్యాసమును ఆరంభించి సభాసీనులకు అదృష్టాశ్రుత పూర్వంబులగు ధర్మసూక్ష్మంబులను దెల్పుచు శాస్త్ర హేతువాద సమ్మేళనము చే వైదికధర్మ ప్రాశస్త్యంబును స్పష్టముగ బోధించుచు సందఱను సనాతన ధర్మరక్షణ బద్ధకంకణులగు నంతటి యుత్తేజమును గల్గునట్లు సేసిరి. దానసభాస్తారులందఱు మిక్కుటంబగు మోదంబు నొందిరి. ఉనంతరము పౌరుల ప్రార్థనముపై భారతీంద్రులు మైలాపురము సంస్కృత కలాశాలయందు "The key stone of Bhagavad gita. The key stone of Dharma." అను విషయములఁ గూర్చి యుపన్యసించి పూర్వము మధ్యపరగణాలయందు అచటి భక్తులకు మఱల దర్శనమిత్తుమని మాటనిచ్చుటచే 24—12—29 తేదినాఁటికి మధ్యపరగణాలలోని చాందానగరమును అలంకరించిరి. అటఁ బ్రజలచే సకలవిధముల సమ్మానింపఁబడుచు ధర్మోపన్యాసంబులఁ గావించుచు అద్దేశమున మిగుల ననర్థహేతువుగాఁ బరిణమించిన "కలంకిప్రకరణ" ప్రవాదమును విచారించి అద్దానిని

అపనయించి అక్కడివారలచే స్తుతింపఁబడుచు వరోరా, బల్లా పురము మున్నగు గ్రామంబుల సంచరించి ధర్మోపదేశం బులఁ గావించుచుఁ గ్రమముగా 12—1—30 తేదీనాఁటికిఁ దెనాలి నగరమునఁ బ్రవేశించిరి.

అంతలో గోదావరి మండలములోని బ్రహ్మపురి (వేరూరు) నివాసులు శ్రీపీఠము నెక్కెన సకల విద్వన్మం డలముచే మండితమయిన కౌశికాతీరంబునఁ బ్రతిష్ఠించి తమ్ము ధన్యులఁ జేయవేఁడ శ్రీవారు భక్తుల ననుగ్రహింపఁ దెనాలినుండి బయల్వెడలి మధ్యేమార్గముననున్న జనపదంబు లయందును బట్టణంబులయందును ధర్మబోధసేయుచుఁ గ్రమ ముగా 31—3—30 తేదీనాఁటికి బ్రహ్మపురమునఁ బ్రవేశించి శ్రీపీఠము నచటనేయుంచి అద్దానికి అనుబంధముగ వేద సంస్కృత పాఠశాలల నెలకొల్పిరి. కాని అప్పురి జిజ్ఞాసా పరులై ఆచార్యశ్రీచరణుల యంఘ్రిసరోజములసేవింప నేగు దెంచు సకల భారతీయుల గమనాగమనములకు ధూమశకట యానానుకూల దేశము కాకపోవుటచే భక్తగణము మిక్కు టంబగు శ్రమ నొందుచుండెను. కావున శ్రీవారు పీఠ మును మాత్రమందుంచి శిష్యసందోహమునకు అనుకూల్యము సిద్ధించుటకై తమ కార్యనిర్వాహక వర్గముతో పాటు తాము గూడఁ దెనాలియందే నివసించుచు వలయుసమయమునకుఁ బేరూరు వెడలుచుండెడివారు.

ఇంతలో విశాఖపట్టణ మండలములోని దేవాడ యను నగ్రహారమునఁ దమ శిష్యోత్తము లగు పూర్ణానంద భారతులు గ్రామస్థుల ప్రార్థనపై మహేశ్వరుని నెలకొల్ప సమ కట్టి యట్టి పుణ్యకార్య నిర్వహణమునకుఁ దమ యాచార్య

పాదులగు శ్రీ జగద్గురువుల వేఁడగా వారి వేఁడికోలుపై నటకేగి అందుఁ గల్యాణపూర్ణేశ్వర ప్రతిష్ఠ 1–5–1930 తేదియందు జయప్రదముగ నిర్వహించి యటనుండి సదాచార సంపన్నులగు నధ్యయనపరులతో నిండియున్న పెదనందిపల్లె యను నొక విప్రాగ్రహారంబునకు విజయముసేసి అట గ్రామస్థుల ప్రార్థనముపై 7–5–30 తేదియందు అన్నపూర్ణా శ్రీచక్రంబులఁ బ్రతిష్ఠించి శిష్యతతియొక్క సనాతన ధర్మ పద్ధతులను మెచ్చుకొని హితబోధసేయుచుఁ గ్రమముగాఁ దెనాలిపురమునకు విజయముసేసిరి.

దేశమున మతసంస్కరణ మను నొక యనర్థకంబగు నభిప్రాయమును మనంబున నిడి దేశాభిమానులు కొందఱు తమపనికాని దానియందుఁ బ్రవేశించి ఏవియో కొన్ని సభలను జేయుచు స్వాభిమతంబుల సాధింపనెంచుచుండిరి. అట్టి దానిని మదనమోహనమాలవ్యా కాశికాపురియందు జరుపనెంచి అమాయిక పండితబృందమును రావించి కలికాలంబున అభీష్టంబులగు కొన్ని సంస్కరణంబులను జేయనెంచగాఁ అద్దానిని భారతీంద్రులు గని దాన మిక్కిలి ధర్మోపద్రవము గల్గునను నాశయముతో వెంటనే “మాలవీయ దుర్వాదనిర్వాపణము” అను నొక పత్రిక వ్రాసి 17—6—30 తేదియందు వెల్లడించిరి. అనంతరము 5—12—30 తేదికి సరియగు మార్గశీర్ష శుద్ధ పూర్ణిమనాఁడు మహారుద్రయంత్ర కల్యాణ ప్రస్తారముపైఁ బూజసేసి ఆరేయి సకలవివాదములకు ఆలవాలమగు సప్తర్షిమండలస్థితి పూర్వఫల్గునియందే యని ఒక మహత్తరవిషయమును గనిపెట్టి లోకమున వెల్లడించిరి.

ఇది యిట్లుండ బోధానంద భారతీమాంతాచార్యమహా స్వాములవారు 9—4—31 తేదియందు బెజవాడయందు బ్రహ్మైక్యము నొందినారని విని అట కేగి యుపాధికిఁ దగు సంస్కారములను జరిపించి క్రమముగా నైజాము రాష్ట్రమున వేములవాడయందలి భక్తులు తాముసర్వతోముఖక్రతువుసేయ సంకల్పించితిమనియు నద్దానికిఁ దాము తప్పక విజయముచేసి అయ్యది సంపూర్ణమగున ట్లనుగ్రహింపవలయు ననియు సవినయముగ నాహ్వానముసేయ నటకు 27—5—31 తేదినాఁటికి వెడలి అధ్వరమును యథావిధి జరిపించి తిరిగి స్వస్థానమున కేగుదెంచిరి.

కొన్ని దినములకుఁ గలకత్తా నగరమున వర్ణాశ్రమ స్వరాజ్యసంఘమువారు తామొక సభను గావించుచున్నాము గావున విచ్చేయవలయునని యొక యాహ్వానమును బంపఁగా, ఆ సభాసూత్రధారులు లోకవంచకులును ధనసంచయ సంపాదనైక తత్పరులనియు నెఱిఁగియు నవ్వారి కార్యక్రమ మెట్లుండునో గని తగు శాసనముచేయ సమకట్టి తాము 25—12—31 తేదీనాఁటికిఁ గలకత్తాపురము చేరఁగా ఆకుటిల సూత్రధారులు శ్రీవారు వచ్చినఁ దమ మిథ్యాభిశంసనములు సాగనేరవని తలఁచి యెద్దియోయొక వంకచే భారతీంద్రుల కా సభయందు ఉచితమగు స్థానము నొసంగలేక పోయిరి. తాము తలఁచినట్లే ఆసంఘము ధర్మవిప్లవము గావించుచు లోకప్రతారణముమూలమున వసుసంపాదనమునకుఁ గడఁగుచున్నదని వెనువెంటనే యా సభాస్వరూపమును లోకమునకు వెల్లడిచేయుచు నా సభను బహిష్కరించిరి.

తాము తిరిగివచ్చు సమయమునఁ బేరూరదిగి పీఠ పరిస్థితుల గమనించి అటనుండి బయల్వెడలి గుంటూరు మండలములోని వేమవరగ్రామమున భక్తుల ప్రార్థనముపైఁ బాండురంగ ప్రతిష్ఠను గావించిరి. ఇంతలోఁ దాము గుంటూరఁ జేయఁదలఁచిన రాజరాజేశ్వరీ ప్రతిష్ఠకు జీవకళయు సకల దేవతాలక్షణములును నొప్పు నొకవిగ్రహమును దయారు చేయ శిల్పకలాచతురుఁడగు నొకనికి ఆనతీయ అతఁడా విగ్రహమును దయారుసేసి తేఁగా ఆతనిఁ దగువిధముల సత్కరించి యా విగ్రహమును దీసికొనిరి. సుమారు రెండునూఱుల వత్సరములనుండి శ్రీపీఠము నిలువనీడ లేక తిరిగినచోఁ దిరుగక మిక్కిలి యిక్కట్టుల పాలాయెను. కావున ఈ విషయమును ప్రధానముగ గమనించిన శ్రీవారు ఎంత శీఘ్రముగ శ్రీపీఠమునకు నొక నెలవుగల్పించి స్థిరప్రతిష్ఠ చేయుదుమా యని చూచుచుండిరి గాని యందులకు అనుకూలములగు పరిస్థితు లేర్పడలేదు. నేఁటికి శ్రీవారి ధర్మప్రబోధముల చేతను బీఠచరిత ప్రఖ్యాపనము చేతను శిష్యకోటికి దాని చరితము వెల్లడియగుటచే ఆనాఁటికిఁ బీఠప్రతిష్ఠకు అనువగు పరిస్థితు లేర్పడినవని తలఁచి తగు సౌధముల నిర్మింపఁ జేయుటకు గుంటూరువచ్చి తొలుత 10—5—32 తేదినాఁడు విద్యాశంకర తీర్థరాజ ప్రతిష్ఠగావించి 12-5-32 తేదికి సరియగు ఆంగీరస వత్సర వైశాఖ శుద్ధ సప్తమీ గురువాసరంబున ఉదయము 9-8 గంటలకు మిథునలగ్నమున లోక కల్యాణ ప్రదాయినియగు శ్రీమహాకామేశ్వర్యంబా రాజరాజేశ్వరీ ప్రతాప భారతీ పరాభట్టారికను వైదికాగమోక్త విధానంబున మహావైభవముతోఁ బ్రతిష్ఠగావించిరి.

ఆసమయముననే తాము ప్రతిష్ఠించిన దేవియొక్క పూజ అందఱును జేయవలనుపడదని చాతుర్వర్ణ్యంబు పూజకు ననుకూలమగునట్లు సదాశివ లింగమొకదానిని దేవీస్థానము నకు వెలుపల దేవికి నెదురుగా బ్రతిష్ఠించిరి. ఇట్టి మహా కామేశ్వరీ నిలయమునకు ననుబంధముగా నొక సదనమును నిర్మింప అందులకుఁ దగుసన్నాహముల నొనర్చిరి.

అంత గుంటూరుపురములోని శ్రోత్రియ పుంగవులగు కొందఱు న్యాయవాదులేతెంచి ప్రస్థానత్రయమును దమ సన్నిధిని బఠించి తరింపవలయునని వేఁడఁగా దాము సర్వవిధ ముల దానికంగీకరించి 5-7-32 తేదీకి సరియగు ఆంగీరసవత్స రాషాఢశుద్ధద్వితీయా జయవాసరమున నుదయము 6-30 గంటల వేళయందు సుమారు నలువది యేఁబదిమంది వివేకు లగు శిష్యబృందమునకుఁ బ్రస్థానత్రయమును ద్వైతీయా భాష్యముతోఁ బ్రారంభించి క్రమముగా ఐతరేయముండకము లను 28—9—32 నాఁటికి శాన్తిచేసిరి.

ఇంతలోఁ దాము సంకల్పించిన భవననిర్మాణము సంపూర్ణమగుడు వెంటనే యద్దానికి శ్రీసదన మను నాఖ్య గావించి 30—9—32 తేదీకి సరియగు భాద్రపద బహుళామా వాస్యా భృగువాసరమున నందుఁ బ్రవేశముగావించిరి. అనంత రము మఱల శ్రీసదనమునఁ గల విశాలమగు నంతర్భాగ మున మామూలు శిష్యవర్గమునకు ఛాందోగ్యోపనిషత్ప్రవచ నమును 2—10—32 తేదియందుఁ జేయమొదలిడి క్రమముగా అద్దానినిగూడ ముగించిరి.

4—2—33 తేదియందు నొక భక్తుని ప్రార్థనముపై శ్రీదేవి యావరణముననే సుబ్రహ్మణ్యాంజనేయుల ప్రతిష్ఠను

గావించి భక్తజన రుజాపనోదకుఁ డగు శృంగేరీభట్టునుగూడఁ బ్రతిష్ఠించిరి.

పైని చెప్పఁబడిన యుపనిషద్భాష్యంబుల శాన్తి గావించిన యనంతరము 24—2—33 తేదియందు శాంకర శారీరక మీమాంసాభాష్యరాజంబును యథావిధి నారంభించిరి.

అంత శతరుద్రీయోక్త రుద్రదేవతలను రుద్రమండల రూపమున నొకచోటనే ప్రతిష్ఠింప నెంచి ఈ రుద్రమూర్తులఁ దెచ్చుటకు నోంకారక్షేత్రమున కేగి యటనున్న నర్మదయందలి బాణములఁ దెచ్చుచుఁ ద్రోవయందుఁగల చాందా, నాగపురము, ధారాక్షేత్రములయందలి శిష్యసమూహమును దమ యుపదేశామృతముచేఁ దరింపఁజేయుచు స్వస్థానముచేరి 29—5—33 తేదియందు భక్తబృందముల యభిషేకాదులకు సుకరముగా నుండునట్లు శ్రీరుద్రమండలమును ప్రతిష్ఠించిరి.

సర్వవిధముల బ్రాహ్మణ్యముతో నొప్పు గర్తపురి యందు అనుకూల మగు స్థలమునఁ బరదేవతను బ్రతిష్ఠించుటచే ఇఁకఁ బేరూరఁ బీఠసామగ్రినుంచుట అనావశ్యకమనియు, అందును బ్రధానతమం బగు విద్యారణ్యప్రతిష్ఠిత శ్రీచక్ర రాజము కాలస్థితులఁ బట్టి వేఱుగా నుండఁగూడ దనియుఁ దలఁచి అటనుండి గర్తపురికి సకలసామగ్రినిదెప్పించి శ్రీవిద్యారణ్యప్రతిష్ఠిత శ్రీచక్రమును శ్రీపరమేశ్వరీసన్నిధానముననే వెనుకవైపున 5—6—33 తేదియందు స్థిరముగాఁ బ్రతిష్ఠించిరి.

ఇట్లు ఒకదిశ వేదాన్తప్రవచనాదులచేతను వేఱొక దిశ దేవతాప్రతిష్ఠాదులచేతను జగద్గురువులు ధర్మసంస్థాప

నము చేయుచున్న సమయమున ఒక శిష్యపుంగవుఁడు తాము చేయు ప్రస్థానత్రయ ప్రవచనము గ్రంథరూపముగానున్నచో శాశ్వతంబుగ భారతీయులందఱకు అందుబాటులో నుండును గావున అట్లొనర్ప వేఁడఁగా శ్రీవారు అందుల కియ్యకొని శ్రీ విద్యాశంకర గ్రంథమాల నొకదానిని బ్రకటింప నిశ్చయించి అందుఁ దొలుతఁ బ్రకృతమున అందఱ హస్తములలోఁ బరమపూజ్యముగా వెలయుచు విప్రతిపత్తి సహస్రంబులకు ఆలవాలమగు భగవద్గీతలకు హృదయము నాఁదగిన "గీతామృత తరంగిణి" యను నొక భావగంభీరమగు విపుల వివరణమును వ్రాసి లోకమున కనుగ్రహించిరి.

గీతామృత తరంగిణిని వ్రాయు సమయముననే యొక నాఁడు హఠాత్తుగా

"నాహం ప్రకాశస్సర్వస్య యోగమాయాసమావృతః"
"మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాంతరంతితే"

అనుగీతములభావము సవిశేషముగా స్ఫురింప నద్దానిని అనుసరించి యుపాసించుటకు అర్ధబృగళంబును గామకామేశ్వరీ స్వరూపంబును అగు నొక విగ్రహమును దయారు చేయించి "యోగమాయ" అనుపేర 17—2—34 తేదియందు ధనుర్లగ్నమున వేకువ 3-40 గంటలకుఁ బ్రతిష్ఠచేసిరి. అనంతరము 10—5—34 తేదియందు సూత్రభాష్యమును శాంతి గావించి శ్రీ విద్యాశంకరుల విగ్రహమును బ్రతిష్ఠసేయనెంచి విద్యాశంకర భవనమని తాము నెలకొలుపఁ దలఁచిన ప్రదేశమునందు ఆయతన మొకదానిని గట్టించి యందు 23-6-34 తేదియందుఁ గన్యాలగ్నమున మధ్యాహ్నము 12-20 గంటల

సమయమున లేఁబ్రాయము సువ్యక్తమగు నొక విద్యాశంకర విగ్రహమును ప్రతిష్ఠించిరి. కాని అయ్యది తమ ప్రకృత నివాసమగు శ్రీసదనమునకు దూరమగుటచే శ్రీదేవి నికటముననే శ్రీవిద్యాశంకరులఁ బ్రతిష్ఠింప నెంచి 21—7—34 తేదియందుఁ గన్యాలగ్నమున 10-45 గంటలకు శ్రీదేవి సన్నిధానముననే మఱియొక శ్రీవిద్యాశంకర ప్రతిష్ఠగావించిరి. ఇంతవఱకు ఉపనిషత్సూత్రభాష్యంబులను శాన్తిచేయుటచే అవశిష్టంబగు గీతాభాష్యంబును 13—7—34 తేదియందు ప్రారంభించి 25—9—34 తేదికి సరిగా ముగించిరి.

ఇట్లు 5—7—32 తేదియందు ఏముహూర్తంబున నెంత శిష్యబృందముతోఁ బ్రస్థానత్రయప్రవచనమును శ్రీవారు ప్రారంభించిరో ప్రతిదినమును ఆవేళకే అంతటి శిష్యబృందము తోడనే అవిచ్ఛిన్నంబుగ మహావైభవంబుతోఁ బ్రవచనంబును గావించుచు 29—9—34 తేదినాఁటికిఁ బ్రస్థానత్రయశాన్తి సమగ్రముగ నొనర్చిరి. అంత తమసన్నిధానమున ఆద్యన్తము సక్రమముగ అధ్యయనమును జేసిన ఛాత్రతతి విజ్ఞానమునకు మెచ్చి యొక్క సభనుగావించి అందువారలకు "వేదాన్త పారీణ" యను నొక బిరుదమును అనుగ్రహించిరి.

ఇంతలో అద్వైతసిద్ధాన్త తత్ప్రతిపాదకాచార్యదూషణమే ప్రధానకార్యముగా నెంచిన యుత్తరాదిమఠస్థ సత్యధ్యానతీర్థులను నొక ద్వైతస్వాములు తమ యద్వైతనిందా ప్రచారమునకై దా వ్రాసిన "సివిల్ కేస"ను గిర్వాణ గ్రంథములను గొన్నింటిని దమ[illegible]వన ధర్మవ్యాపనము గావించుకొనుచున్న శ్రీభారతి చరణుల సన్నిధానమునకు బంపెనే గాని—

"శమప్రధానేషు తపోధనేషు గూఢంహిదాహాత్మకమస్తి తేజః" అను హితోపదేశమును గ్రహింప లేదు. శ్రీవారును తత్క్షణముననే ఆతని దండగములను ఉదయముననే తమ సన్నిధికి వచ్చు నంతేవాసివితతికిఁ దెలియఁ జెప్పి వారల కోరిక-పై బహిరంగశ్రీముఖము నొకదానిని వ్రాసి మాచేయు నాక్షేపంబులనుండి నీ కుమతంబును రక్షించుకొమ్మనుచుఁ గులిశంబులవంటి యాక్షేపంబుల నాతనిపైఁ బ్రయోగించిరి. అంత వఱకు మతాంతరములను సాధారణగౌరవముతోఁ జూచుచుఁ దన్మతస్థులను దమ శిష్యకల్పులనుభావముతో నొప్పు భారతీంద్రులు నాఁడు మొదలు ద్వైతద్విపపంచాననులై 15—1—35 తేది మొదలు 'మధ్వ మతభంజని' యనుపేర మధ్వ మత ప్రమాణగ్రంథములను ఉపన్యాసరూపంబున విమర్శించుచు ఆ మతముయొక్క నైచ్యభావమునంతను సుస్పష్టముగ లోకమునకు వెల్లడించుచు వైదికధర్మసంవర్ధనీపత్రిక నొకదానిని నెలకొల్పి అవ్వానిని గ్రంథస్థము చేసిరి. అది మొదలు శ్రీవారుండుచోటుల ఇట్టి ప్రచారము క్రమముగాఁ దఱుఁగఁ జొచ్చెను.

తరువాత శిష్యజనప్రార్థనముపై నిత్యవిధియగు సంధ్యావందనమును గూర్చి పదునాఱు ఉపన్యాసంబులఁ గావించి సంధ్యాప్రాశస్త్యంబును శిష్యవర్గంబునకు బోధించిరి.

ఇంతలో మఱల సత్యధ్యానతీర్థులు తమ వెనుకటిగుణ మేల మానుదురు? బళ్లారినగరమునకుఁ బోయి అట మామూలుగా అద్వైతనిందఁ గావింప మొదలిడెను. అచటి యద్వైత ప్రబోధకసంఘమువారు ఇంతకుఁ బూర్వము శ్రీవారి మత విమర్శనాచాతురిని బత్రికలందుఁ గనులారఁ గాంచినవారు

గావున వెంటనే శ్రీవారిరాకను వేఁడుకొనుచు ఆహ్వానము పంపిరి. శ్రీవారును ఆహ్వానము గైకొనిన వెంటనే బయలుదేఱి 23-4-35 తేది మొదలు 29-4-35 తేదివఱకు బళ్ళారియందుండి ప్రతిపక్షిసంకులంబగు సభలయందే శ్రుతిస్మృతిన్యాయములచే సర్వవిధముల అద్వైతమే ప్రమాణసిద్ధమని నిరూపింప ఆ సభయందుఁగల ద్వైతయతిశిష్యులును, ఆస్థానపండితులునుగూడ సమాధానము నీయఁజాలక వెడలి పోవుచుండిరి.

ఇట్లా ద్వైతస్వాములను సర్వవిధములఁ బరాభవించి మఱల స్వస్థానంబునకువచ్చి భారతదేశంబున సకలశాస్త్రంబులందును ఏకైకపండితు లని పేరువహించి సహస్రంబుల కొలఁది ఛాత్రసంతతికి విద్యగఱపుచుఁ దమ వైదికధర్మ పరిషత్తునకొక సభ్యులుగానున్న బ్రహ్మశ్రీ మహామహోపాధ్యాయ కలాప్రపూర్ణ తాతా సుబ్బారాయశాస్త్రిగారు వయోవృద్ధులగుటచే వారలకు 16-5-35 తేదియందుఁ దమ శ్రీ పీఠసన్నిధిని బండితలోకమునకు సమ్రాట్టుగా సామ్రాజ్యాభిషేకంబు గావించి గొప్ప యుత్సవమును జరిపి యందు "వైయాకరణ సార్వభౌమ" యను బిరుదము నొసఁగిరి.

వెనుక గీతా సూత్ర భాష్యంబులను సాంతముగాఁ బ్రవచనము చేసినను ఉపనిషత్ప్రస్థానమున బృహదారణ్యకము మున్నగువాని కొఱత ఉండుటచే అవ్వానిని అధ్యాపనంబు గావింపఁదలఁచి అందుఁ దొలుత బృహదారణ్యకమును బ్రారంభించిరి.

ఇంతలోఁ బలాండున్యాయమున మఱల బళ్ళారి మండలాంతర్గతంబగు నాదవాని పురంబున మఱలఁ దీర్థులవారి

యల్లరి ప్రారంభమాయెను. బళ్ళారియందు వారికి జరిగిన పరాభవమును బాగుగ నెఱింగినవారగుటచే ఆదవాని పురజనులు శ్రీవారికి వార్తను విన్నవింపఁగా వారు గుంటూరు పురమునుండి శీఘ్రముగఁ దగుపరివారముతో ఆదవానిపురము ప్రవేశించి పూర్వముకన్నను విశేషముగా ద్వైతులసమక్షము ననే 21-12-35 తేదీ మొదలు 31-12-35 వఱకు ప్రతి దినము శ్రుతి స్మృతి యుక్తి రేఖాగణితాది సకలశాస్త్రంబులకు అద్వైతమే శరణ్య మనియు ద్వైత మెన్నడును ఎట్టి శాస్త్రముచేతను సిద్ధింపనేర దనియు నిరూపించి అచటి ద్వైతులచేతనే యా నిరూపణము యుక్త మని పలికించిరి. ఆ దినములయందు జగద్గురువు లొసఁగిన యుపన్యాసంబులను ప్రతిపక్షులుగూడ విని యచ్చెరువు నొంది శిరసాగ్రహించిరి. అద్వైతిప్రబోధకసంఘముగూడ నామమాత్రముగ కిందఱు పీఠాధీశులున్నను, శ్రీవారే మతప్రతిష్ఠాపకులును ధర్మసంస్థాపకులును అని స్తుతించుచు ఒక సభ గావించి అందు శ్రీవారికి "ద్వైతధ్వాంత చండభాస్కర" అను బిరుదమును అత్యంత ముదముతో సమర్పించుకొనిరి.

ఆదవానిపురమునుండి విచ్చేసి పూర్వ మారంభించిన బృహదారణ్యకంబును ఈశావాస్య కఠప్రశ్నంబులను గూడ శిష్యులచే శాన్తి చేయించిరి.

ఇట్లు ప్రస్థానత్రయ ప్రవచనము దేవతాప్రతిష్ఠ. దుర్మతనిబర్హణము మున్నగు సత్కార్యములన్నియు నెఱవేఱినవని తలఁచి శ్రీవారు ఎటకేని పుణ్యస్థలంబున కేగి కొంతకాలము తప మొనరించిన బాగుగా నుండునని తలఁచి కర్నూలు మండలమునఁగల మహానందియను పుణ్యక్షేత్రంబు

నకు సముచిత శిష్యగణ పరివృతులై యేగిరి. కొంతకాలము అటనుండి మఱలఁ గుంటూరికివచ్చిరిగాని ఆమహానంది క్షేత్రము అరణ్యానీ మధ్యస్థ మగుటచే శ్రీవారిశరీరమునఁ దీవ్రమగు జ్వరము వ్యాపించెను. అయ్యది క్రమముగా అభివృద్ధినొందు టచే శ్రీవారు 11_6_36 తేదియందు ఒక మరణశాసన మునుగూడ వ్రాయవలసి వచ్చెను. ఇట్లు దానిని వ్రాసి 12_6_36 తేదియందే 'రిజిష్టరు' గూడఁ జేయించిరి. కాని వైదిక ధర్మతత్పరుల భాగ్యవిశేషమున ఆ రోగము క్రమ ముగ మాయమయ్యెను. ఇట్టి నీరసస్థితి యందును సదా భారతీసేవ చేయుచుఁ దమ జీవితము గడుపునట్టివారలకు శిష్యుల కెద్దియేని బోధసేయక తోఁప లేదు. కావున శిష్యులు తమ్మను అంతకుమున్ను గోరిన భామతి యను శాంకరభాష్య వ్యాఖ్యానరాజంబును జతుస్సూత్రి వఱకు నధ్యాపనంబు గావించిరి.

ఇట్లు జరుగుచుండ శ్రీవారిచే సర్వవిధముల సర్వత్రి తిరస్కరింపఁబడిన సత్యధ్యానతీర్థస్వాములు గుంటూరఁ దన శిష్యవర్గంబుచే నేవియో గొన్ని పత్రికల వ్రాయించి అణఁగిన కయ్యమును మఱల రేకెత్తింప నారంభింపఁగా దానిపై శ్రీవారు 'మధ్వమత విధ్వంసిని' యనుపేర 1-10-36 మొదలు 9-10-36 వఱకుఁ గొన్ని యుపన్యాసముల పరం పర నీయఁగా ఆ కయ్యము మఱల నెచటనో తిరోహిత మాయెను.

గుంటూరు సమీపమునఁ భేరిచర్ల యను నొక గ్రామము గలదు. దానికి సమీపమునన్నున్న యొక బంజరు భూమి పీఠమునకు సంక్రమించెను. ఆ పరిసర ప్రదేశము

పగలు ఉభయపర్వత మధ్యమమును జూతారణ్య సమీపవర్తియునై యెంతయో మనోహర దృశ్యముగ నొప్పుచున్నది గాని రేయిమాత్రము చోరసంకీర్ణమగుచు మహాభయంకర మగుచుండెను. అట్టి ప్రదేశమున నేమియొనర్పవలయునని శ్రీవారాలోచించి చోరభయ నివృత్తికై ఆర్తత్రాణపరాయణుఁ డగు కల్యాణాంజనేయుని 23-10-36 తేదియందు అచటఁ బ్రతిష్ఠసేసి యొక జయ స్తంభమునుగూడ నిల్పిరి.

గుంటూర నిట్లు శ్రీవారిచే అనితరసాధారణముగా సర్వవిధముల ధర్మబోధ చేయఁబడుటవలన అచట సనాతన ధర్మాసక్తులు చాలమంది వెలసిరి. కావున ఆంధ్రదేశములోని సనాతను లందఱు "అఖిలాంధ్ర దేశీయ సనాతనసభ" ను గుంటూరునందే 19_12_36 తేదియందు జరుప నిశ్చయించి అద్దానికి శ్రీవారినే ప్రారంభకులుగానుండ వేఁడఁగా శ్రీవారద్దానిని జయప్రదముగ నెరవేర్చిరి.

శృంగగిరినుండి శ్రీవిద్యారణ్య భారతీంద్రుఁడు బుక్కభూపాలుని ప్రార్థనముపైఁ దుంగభద్రానదీతీరమునకుఁ దన కార్యస్థానమును మార్చి అట సామ్రాజ్య కేంద్రస్థానముగ విద్యానగరమును నెలకొల్పి తమ వైదికసామ్రాజ్యపాలనమునకు అనువుగ నొక శ్రీచక్రంబును నిర్మింపఁజేసి శ్రీవిరూపాక్ష శ్రీపీఠమును జగద్గురు శ్రీపీఠముగా నెలకొల్పి 27_12_36 తేదినాఁటికి సరిగా ఆఱువందల వత్సరంబులు నిండుటచే 27, 28, 29_12_36 తేదు లందు శ్రీవారు గుంటూర విరూపాక్ష శ్రీపీఠ షట్ శతాబ్ద్యుత్సవమును మహా వైభవముతో జరిపి శ్రీపీఠచరితమును, భక్తులకు సరిగా నెఱిఁగించిరి.

ఇట్టీ యుత్సవము నెఱవేఱినపిమ్మట శ్రీవారు దశోప నిషద్భాష్య ప్రవచనమున మిగిలియున్న కేన మాండూక్యము లను శాన్తిచేయించిరి. వీనితో 1932 సంవత్సరమున ఆషాఢ శుద్ధ ద్వితీయనాఁడు ప్రారంభించిన ప్రస్థానత్రయము సక్ర మంబుగను సమగ్రంబుగను అధ్యయనము చేయింపఁబడియెను.

ఇట్లు తమ కార్యంబు లన్నియు సక్రమంబుగ నెఱ వేర్పఁబడి సఫలంబులుగఁ జేయఁబడినవని శ్రీవారు తలఁచు చుండిరి. భక్తగణము మాత్రము ఇతోఽధికముగ శ్రీవారిచే అన్తేవాసులకు అభ్యుదయ హేతువులగు పుణ్యకార్యంబులను జేయింపఁ దలఁచుచునే ఉండిరి. గుంటూరనుండు శ్రీవారి యాంతరంగిక భక్తులలో ఒకరగు ఎల్లేపెద్ది సాంబశివశాస్త్రి గారు ఎవ్వరైన నేదేని మంత్రానుష్ఠానము గావించుకొనుటకు ఏకాన్తమగు నొక దేవతాయతనము గావలయునని ప్రోత్స హింప వారి యుత్సాహముపై శ్రీ విద్యాశంకరభవనావరణ ముననే మనోహరంబగు దేవతాసదనము కట్టించి యందు మహాకామేశ్వరప్రతిష్ఠ నొనర్చిరి. నాఁడుమొదలు అయ్యది యనవరతము పూజా జప పారాయణంబులకు ననుకూలముగా నుండెను.

అంతలో భారతదేశమున సుప్రసిద్ధ దైవమగు సత్య నారాయణమూర్తికిఁ దావలంబగు నన్నవరమునందలి సత్య నారాయణాలయమునకే శిఖర ప్రతిష్ఠ కొఱఁతయుండుటచే ఆధర్మకర్త శ్రీవారిని అద్దానిని నెఱవేర్ప వేఁడఁగా వారద్దాని కియ్యకొని 23-5-37 తేదియందు అపుణ్యకార్యమును నిర్వర్తించిరి.

కాలవశంబున గలుగు పరిణామంబులు తత్తద్దేశము లంకుఁ దత్తద్దేశోచితములుగఁ గలుగుచున్నను భారతదేశము నందు మాత్రము పాశ్చాత్యసంసర్గమున నయ్యవి సర్వవిధముల దేశానర్థకరములైనవని యనుట యదార్థమే. అందునను దేశాభివృద్ధికిఁ బ్రధానమగు వాఙ్మయమున నెంతయో క్షీణదశ ప్రారంభమాయెను. స్వతంత్రములగు సనాతన భావములు నశించినవి. తుదకుఁ బురాతనమగు మన వాఙ్మయము నేఁటి విమర్శకుల చేతులలోఁబడి రూపుమాసిపోయెను. గ్రంథారంభకాలములన్నియుఁ దాఱుమాఱయ్యెను. ఇట్టి దేశక్షోభమును బోఁగొట్టుకొనుటకుఁ గొన్ని సంఘములు దేశమున బయల్వెడలినవి. అందు విద్యలకు నిలయమగు విజయనగరమున భారతదేశమునకు హానికరమగు వాఙ్మయదాస్యమును బోఁగొట్టుటకై ఆనగరవాసులు వేదవిజ్ఞాన పరిషత్తు నొకదానిని స్థాపించిరి. అద్దానియందు సకల విధములగు వాఙ్మయవిచారములును తఱచు జరుగుచునేయుండును. ఒకనాఁడు విజయనగరమున బ్రహ్మసూత్రరచనాకాలమునుగూర్చి ఆంగ్లకలాశాలోపన్యాసకులకును సంస్కృత కలాశాలా పండిత బృందమునకు వివాద మేర్పడెను. నాగార్జునుని బౌద్ధమతప్రచారానంతరము ఈ సూత్రములు చిరయింపఁబడినట్లు సూత్రములందలి విషయమునుబట్టి తెలియుచుండుటచే ఈసూత్రములు వ్యాసరచితము లెంతమాత్రము కావని ఆంగ్లోపన్యాసకుల వాదము. చారిత్రిక దృష్టితోఁ బరిశీలించినను సూత్రతద్భాష్యపద్ధతులను గమనించినను సూత్రములు చాల ప్రాచీనములే గావున నయ్యవి వేదవ్యాసమునీంద్రులచేతనే రచితంబు

లైనట్లు తప్పక నిర్ణయింపవచ్చునని సంస్కృత కలాశాలా పండితబృందము వాదము. ఈ రెండువాదములలో ఏది సోపపత్తికమో ఏది నిరుపపత్తికమో విచారించి నిర్ణయింపఁగలవారెవ్వరని వేద విజ్ఞానపరిషత్తు సభ్యులు ఆలోచించి అట్లు నిర్ణయింపఁ గలవారు భారతీశ్రీచరణులే యని నిశ్చయించి తమ పరిషద్వార్షికోత్సవ సందర్భమున శ్రీవారిని అగ్రాసనాధిపతులుగా రా వేఁడి అం దీ నిర్ణయము సేయఁ గోరుచు శ్రీవారి సన్నిధికి వారొక విన్నపమును బంపుకొనిరి. దానిపై శ్రీవారు 26-8-38 తేదిని విజయనగరమునకు వేంచేయఁగా వెంటనే ఆంగ్లకళోపన్యాసకులు అందఱు తమ వాదము నుపసంహరించుకొనిరి. కావున సంస్కృత కలాశాలాపండితుల వాదమే నిలిచినది. దానిపై శ్రీవారు పరిషదుత్సవసందర్భమున వ్యాససూత్ర రచనాకాల నిర్ణయమునకుఁ గడంగుచు సూత్రరచనాపద్ధతిని గ్రంథస్థవిషయమును విమర్శించియు, మహామహోపాధ్యాయ సుబ్బారాయశాస్త్రిగారు సూత్రములను జారిత్రకదృష్టితో విమర్శించియు బ్రహ్మసూత్రములు కలిద్వాపరసంధియందు శ్రీకృష్ణద్వైపాయన వేదవ్యాసమహర్షి చేతనే రచింపఁబడినవను నొకే నిర్ణయమునకు వచ్చిరి.

ఇట్లు తాము విచ్చేసినకార్యము చక్కఁజేసి శ్రీవారు మఱలఁ దమ స్వస్థానమునకు బయలుదేరఁగాఁ బురములోని పెద్దలు సంస్కృతకలాశాలావిద్వాంసులు శ్రీవారికడఁ జేరి ఇంకను మఱికొన్ని దివసంబులు ఈ పురముననే యుండి వేదాన్తసారమును గూర్చియు మంత్రశాస్త్రమునుగూర్చియుఁ గొని యుపన్యాసముల నిచ్చి మమ్ములఁ దరింపఁజేయవలయు

నని వేఁడఁగా శ్రీచరణు లద్దాని నంగీకరించి 15—9—37 వఱకు విజయనగరముననే యుండి వేదాన్త మంత్రశాస్త్రం బులఁ గూర్చి అనర్ఘంబులగు నుపన్యాసంబుల నొసఁగిరి. ఆ యుపన్యాసములకు నగరములోని సకల శాస్త్రముల యందుఁ బ్రవీణులగు పండితులును గొప్పగొప్ప బిరుదము లను వహించి ఆంగ్ల కలాశాలయందు ఉపన్యాసకులుగా నున్నవారును ఇంక ననేకులు విపశ్చిన్మణులును నూటయేఁ బదిమందికిఁ బైఁగాఁ బ్రతిదినము హాజరగుచుండిరి. ఇందొక విశేషముగలదు. విజయనగర సంస్థానమునకు మంత్రిగా నుండిన ఏచూరి నరసింహముగారును, ద్వైతిగణములలో మిగుల విఖ్యాతిఁజెందిన సంపన్న గృహస్థులగు కానుకుర్తి కృష్ణారావుగారును విశిష్టాద్వైతులలోఁ దమ మతగ్రంథములను అభినివేశముతోఁ గూలంకషముగఁ జదివి సంస్కృతకలాశాల యందు వ్యాకరణపండితులుగానున్న శ్రీ కోవిల్ కందాడై వేంకట రామాచార్యులుగారును స్మార్త పండితవర్గమునఁ బ్రధానులగు మహామహోపాధ్యాయులును తర్కతీర్థ పేరిల శ్రీ నారాయణశాస్త్రిగారును వ్యాకరణాచార్య పేరి వేంకటేశ్వర శాస్త్రిగారును వ్యాకరణాలంకారాచార్య ఉప్పల్ల జోగన్న శాస్త్రి కట్టి శ్రీరామమూర్తిశాస్త్రిగారలు తక్కుంగల పండిత బృందమును వచ్చి అత్యంత భక్తి శ్రద్ధలతో భారతీంద్రుల చరణ సన్నిధిఁజేరి ఉపన్యాసంబులను దనివితీర వినుచు అధికప్రీతి నం దుచు దమతమభవనంబుల కేగుచుండిరి. ఇట్లు ద్వైతాద్వైత విశి ష్టాద్వైత మతశేఖరులు విశేష సంమోదము నొంది తుదను శ్రీవారికి ధన్యవాదముల నర్పించుకొనుచు నొక సభను గావించి తమ్ముఁ గృతార్థులఁ గావించిన శ్రీవారికి ఒక

సమ్మాన పత్రమును రజతోత్తానపాత్రంబును అంఘ్రి పంకే రుహంబులకడ సమర్పించికొనిరి. ఇట్లు నిండుమనంబుతోఁ బ్రదిమతస్థులచేతను ఇంతవఱకు విజయనగరమునఁ బూజగొన్న వారు శ్రీవారొకరే! ఈరీతిగ విజయముతో నీయాత్ర సాగించి క్రమముగాఁ గేంద్రమునకు విచ్చేసిరి.

వైదిక మతమునకు ఆధారభూతములగు వేదములు అనంతములగుటచే ఆవ్వానినన్నింటిని ద్విజులు కాలక్రమేణ చదువ నశక్తులని తలంచి కలిద్వాపరసంధియందు వేదవ్యాస మహర్షి వేదవిభాగమును జేసి యొక వ్యవస్థ నెలకొల్పెను. తరువాతఁ గొంత కాలమువఱకు ఆ వ్యవస్థ ననుసరించియే ఆమ్నాయాధ్యయనాధ్యాపనంబులు జరిగినను గలి ప్రబల మయిన కొలఁది పరిపాలకులు అవైదికులగుటచే వేద ప్రతిష్ఠ తఱుగ నధర్మము పెఱుఁగ జొచ్చినది. వేదమార్గాను యాయులుసైతము వేదవిద్య బహుకాల సాధ్యమునుచు అధ్యయనమునుండి తొలఁగుచుండిరి. మన భారతీంద్రు లిట్టి పరిస్థితిని గని వైదికకర్మలలోఁ బ్రధానములగు యాగాదులకు వేదము నందలి యే యే భాగములు ప్రధానములో ఏ యే భాగములను అధ్యయనము గావించిన మాత్రమునఁ గృత్స్న వేదపారాయణ ఫలము గల్గునో అట్టి ప్రధానములగు వేద భాగంబులను సరిచూచి యేర్చి 'కల్యాణసంహిత' యనుపేర ఒక గ్రంథమును 1—4—1938 తేదియందుఁ బ్రకటించి వైదిక మార్గసంస్థాపనంబునకు సులభంబగు మార్గమును ఉపదే శించిరి. ఇద్దాని లౌకిక వ్యాపారములు జరుపుకొనుచుఁ గూడ సామాన్య జనులు రెండు వత్సరములలో అవలీలగాఁ జదువవచ్చును.

ఇట్లు ధర్మ వ్యవస్థకై శ్రీవారు సర్వవిధములఁ బాటు పడుచుండఁగాఁ గామకోటి మఠాధిపులగు చంద్రశేఖరేంద్ర సరస్వతులు తమ యాధిక్యమును లోకమునకుఁ బ్రకటింప నెంచి తమ పరశిష్యునొకనిని 2-1-34 తేదియందు శ్రీవారి యొద్దకుఁబంపి తాము దేశము నందంతటను సంచారము గావించుచు ఎద్దియో ధర్మమును బ్రవర్తింపఁజేయు చున్నట్లును, అనాదిసిద్ధ మగు జగద్గురు పీఠము తమదియే యగుటవలన అద్దానినే శ్రీవారుగూడ అనుసరించి ధర్మప్రవ ర్తనము చేయవలయు ననునట్లును ఒక సందేశమున సూచించిరి. ఇట్టి దాంభిక వేషమును శ్రీవారు సహింపక ధర్మప్రవ ర్తనమున కయ్యది మార్గము కాదనుచు, ఆ కామకోటి సంప్రదాయము నూతన ప్రతిష్ఠితం బగుటచే అయ్యది అనాదిసిద్ధ మగు జగద్గురుపీఠ మెంతమాత్రము కాదనియు నాక్షేపించిరి. కామకోటి మఠాధిపులు అంతటితో నూరకుండక దేశభ్రమణము గావించుచు అప్రతిష్ఠితంబగు తమ పీఠాధిక్యమును బ్రచురింపనెంచఁగాఁ జాలచోటులందు వారిని ధర్మతత్పరు లెదిరించి అయ్యది ధర్మప్రవర్తనమునకు సమంచితమగు మార్గము కాదని హితము గఱపిరి. కాని ఆ మఠాధిపులు క్రమముగా అట్టి బోధనే చేయుచు గుంటూరు పురమునకే వచ్చిరి. ఇట్లు కామకోటి మఠాధిపులు గుంటూరికి జేరుటలో నొకకొంత విశేషము గలదని యెంచి యంతకు ముందుగాఁ గాశీ మున్నగు క్షేత్రంబులందు వారిమూలమునఁ గలుగు విరోధంబులను ఉందలి శిష్యులమూలమున ఎఱిఁగినవారగుటచే భారతీంద్రులు ఇటఁగూడ ఎవ్వియేని కలహంబు లుత్పాదించు నేమోయని తొలుతనే జాగ్రత్తవహించి గుంటూరుపౌరులకుఁ

గామకోటిమఠ స్వరూపమును దెలుపనెంచి తొమ్మిది యుప న్యాసంబుల నొసఁగి అమఠము దక్షిణదేశమున వెలసినది మొదలు నేఁటివఱకు నందలివారలు చేయు ప్రచారమును లోకమునకు స్పష్టమగునట్లు వెల్లడించిరి. అనంతరము 29–6–38 తేదీ మొదలు 15–9–38 తేదీవఱకు ఏఁబదినాల్గు బ్రహ్మవిద్యోపన్యాసంబుల నొసఁగి వేదాన్తసంగ్రహబోధకై వేదాంత పంచదశిని శిష్యులచే (అధ్యాసము గావించిరి.

శ్రీవారు శిష్యులకు వేదాన్త మంత్రశాస్త్రాదులను అధ్యాపనంబు గావించు సమయములందుఁ బ్రాదుర్భూతం బులగు నపూర్వవిషయంబులను గ్రోడీకరించి వేదాన్తమంత్ర శాస్త్రస్వరూపంబులను సూక్ష్మంబుగఁ దెలుపుచు కాది, హాది, సంఖ్యా, భూమభేదముచేఁ జతుర్విధంబులగు విద్యల స్వరూపమును బ్రదర్శించు నక్షరదర్శనమను నొక గంభీరార్థ సముపేతంబగు సూత్రగ్రంధమును 18–12–38 తేదీయందుఁ బ్రకటించిరి.

భారతదేశమున ఐహికాముష్మిక శ్రేయస్సిద్ధికిఁగార్యా లయములుగాఁ బుణ్యతీర్థంబులు, పవిత్రతమంబులగు దేవా యతనంబులును వెలసినవి. ఎట్టి స్థలములందు ఎట్టి విగ్రహ ములను ఎట్లు ప్రతిష్ఠింపవలయునను విషయము తెలియుటకై వసిష్ఠాది మహర్షులు వేదమార్గ సహకృతంబులగు నాగ మంబులను అనుగ్రహించిరి. అట్టి వైదికాగమంబుల ననుస రించి సక్రమంబుగ అగ్రవర్ణంబులవారు దేవతాయతనంబుల నిర్మింపఁజేసి అందు హృదయంబులవలె దేవతాప్రతీకంబులను బ్రతిష్ఠింపఁగా అవ్వానివలన భారతదేశమునందలి చాతుర్వ ర్ణ్యంబును ఇహాముత్రఫలంబులను అనుభవించుచుండిరి. కాని

క్రమముగా సుమారు రెండుమూఁడుల వత్సరంబులనుండి ఆగమవిధియంతయు శ్రౌతసంప్రదాయదూరులగు నంబితం బళులహస్తములలోఁబడి ఖిలీకృతము కాఁజొచ్చెను. శ్రౌతస్మార్త సంప్రదాయముల నెఱిఁగిన విప్రులు దేవతా ప్రతిష్ఠాదులన్నియు నంబితంబళుల కార్యంబులేగాని తమకార్యంబులు కావని తలఁపోయుచుండిరి. కావున నిట్లు అవిధికృతంబులగు దేవప్రతిష్ఠలచే దేవళంబులన్నియు మాహాత్మ్యమును గోలుపోయి దొంగలకును దివాంధములకును ఆకరములైనవి. ఇట్టి యనర్థమును గ్రహించి శ్రీవారు ఖిలీకృతములైన యాగమంబులన్నిటిని శ్రుతిస్మృతి సదాచారానుప్రాణితములగునట్లు సంస్కరించిరి. అంతియగాక శ్రోత్రియులును శాస్త్రజ్ఞానవాసితులునగు విప్రులే ఁవ్వానిఁ బ్రతిష్ఠింప నర్హులని తెలియఁజెప్పుచుఁ దాము వైదికాగమోక్త ప్రకారంబున ఎన్నియో దేవతాప్రతిష్ఠలను జేయుచును ఉభయవిధములచేఁ గూడ సదాగమప్రవర్తకులైరి. ఇట్టి శ్రీవారి యాగమప్రవర్తకత్వము లోకము గ్రహించుటచే నందందుఁగల శ్రోత్రియబృందము శ్రీవారిచే సాధుకృతంబగు నాగమపద్ధతిని దాము దెలిసికొనుచు నద్దానిని బ్రవర్తింపఁ జేయుచుండిరి.

ఒకనాఁడు కర్నూలు మండలమునందలి మహానంది యను గొప్ప శివక్షేత్రమునందుఁగల శక్తివిగ్రహమునకు ఏదో యంగవైకల్యము జరిగినదనియును, అద్దానికి ఏమి ఎట్లు చేయవలయునో ఏరికిని దెలియలేకపోవుటచే సకల తంత్రాగమజ్ఞులగు మీరు అద్దాని సముద్ధరణమున కేదేని యుపాయమాలోచింపవలయు ననియుఁ దదాలయ ధర్మకర్తనుండి విన్న

పమువచ్చెను. ఆక్షేత్రము తమ రాష్ట్రములోనిదే యగుటచే శ్రీవారు అద్దానికిఁ బ్రీతితోనియ్యకొని తగు పరివారముతో ఆ పుణ్యక్షేత్రంబునకు వెడలి అంగవికలమగు నా విగ్రహము పూజార్హము కాకపోవుటచే ఉద్దానియందు అంతకుమున్న ఆవాహనముచేయఁబడిన కళల నన్నిటిని 2-3-39 తేదినాఁడు ఆత్మారోపణము గావించుకొని మహాశక్తి సంపన్నులై బలిష్ఠు లగు ముప్పురు నల్వురచేఁగాని అతికష్టముగఁ గదలింపఁబడని యా శక్తివిగ్రహముచుదామే యా పీఠమునుండి క్రిందికిదింపిరి. ఇట్టి సాహసకార్య మానాఁడు శ్రీచరణులచే ఎట్లు చేయఁ బడియెనా అని చెంతనున్నవారు మిక్కిలి అచ్చెరువు నొందిరి. ఇట్లాత్మారోపణముచేసికొని తాము శక్తిస్వరూపులై మిగుల తీక్ష్ణమగు తేజంబుతోఁగూడిన రూపముతో ఒప్పుచు 8-4-39 తేదినాఁడు మఱలఁ జక్కని పరదేవతా విగ్రహము నొకదానిని వైదికాగమానుసారమునఁ బ్రతిష్ఠసేసి తమయం దారోపించుకొనఁబడిన కళలను మఱల ఉద్దానియందు ఆరో పించి శ్రీవారు స్వభావసిద్ధమగు సౌమ్యభావముతోనొప్పిరి.

అట్లు మహానంది క్షేత్రమున రాత్రియనియుఁ బగ లనియు గణింపక తమ రాష్ట్రములోనిదగు నాక్షేత్రమున జగ ద్ధాత్రీ ప్రతిష్ఠను దామే యొనర్ప సమకూరుటవలన మిగుల ఆనందపడి ఆ యుత్సవమును మహోత్సాహముతో జరి పిరి కాని అట్లొనర్చిన సమయమునందు శ్రీవారి శరీరస్థితి చాల భయంకరముగ నుండెను. వారియందు ఉత్తమపద్ధతి పూర్ణముగ నెలకొనియుండుటచే ఏదియెట్లైనను ఆరంభించిన కార్యముమాత్రము విఘ్నుచుంబితము కాఁగూడదు. కావున మిన్నువిఱిగి పడినను ఆకార్యము తప్పుటకు వీలులేదు.

మహాసంధినుండి బయలువెడలిన సమయమున వారికి శరీర స్మృతిగూడ లేకుండెను. కార్త్యైకదృష్టితో వారు ప్రతిష్ఠాదుల నొనర్చునపుడు ఇంతటి సుస్తీ శరీరమున నున్నట్లు యెవ్వరికిని దెలియదు. ఇంత రుజతో వారు ఎట్లో గుంటూరు వచ్చినను వారు ఈపూరను నొక గ్రామమున రమాసత్యనారాయణమూర్తిని బ్రతిష్ఠించెదమని పూర్వమొక భక్తునికి వాగ్దానముచేసి ముహూర్తము నుంచుటచే అద్దాని కెట్టిన అంతరాయము కలుగఁగూడదని గొప్ప పూనికతో బుత్విగ్గణముచు దీసికొని అట్టి శరీరస్థితితోడనే ఈపూరు వెడలి త్రిరాత్రదీక్షసేసి 11–4–39 తేదినాడు యథావిధి దేవతాప్రతిష్ఠ గావించిరి.

ఇట్లు సర్వవిధముల శ్రీవారికిఁ గృతకృత్యత యనఁగా సర్వకర్తవ్యతాహాని సిద్ధింపనిక ఎద్దియేని చిరస్థాయియుఁ బీఠనిర్వహణానుకూలంబును అగు నొక వ్యవస్థచేయఁదలఁచి పూర్వము 11–6–36 తేదీని సంభ్రమముతో వ్రాసిన వీలును రద్దుసేసి క్రొత్తవీలు నామాను వ్రాసి యద్దానిని 16–10–39 తేదినాఁడు రిజష్టరు చేయించిరి. 21–10–39 తేదియందుఁ బీఠకార్య నిర్వహణమునకు నొక యైదుగురు సభ్యులుగల కార్యనిర్వాహక పరిషత్తు నొకదాని నేర్పఱచి పీఠముయొక్క సర్వవ్యవస్థలను ఆపరిషత్తే చూచునట్లు నియమించి పీఠ సర్వస్వమును ఆనాఁడే మధ్యాహ్నము పదునొకండు గంటలకు ఆపరిషత్తునకు నొప్పగించి తమ శిష్యవర్యులగు నొక పరమహంస వతంసునికిఁ బరదేవతార్చనా విధానము నుపదేశించి అప్పాటిని శ్రీసదమునయేయుండి పరదేవతాపూజ గావించు నట్లాజ్ఞయిడి తాము ఆనాఁటి మధ్యా

హ్నమే నాలుగుగంటల ముప్పది నిముసంబులకు విశ్వరూప యాత్రసేసి ప్రశాంతాశ్రమపదంబగు విద్యాశంకర మందిరము నకు విచ్చేసిరి.

అట్లు దాము నిశ్చలమగు నిశ్చయముతోఁ బ్రత్యర్పితన్యాసులై ఆవిద్యాశంకర మందిరముననే దినమునఁ జాల భాగము స్వస్వరూపాను సంధానమునఁ గాలమును గడుపుచు దినశేషమున ఎద్దియో కొంచెము సేపు మాత్రము భక్తగణ విచికిత్సా సందోహములను బాపుచుండిరి. ఇట్లు ప్రతి దినము పూర్వముకన్నను నధికముగ విద్యాచింతనము చేయు చుండు వారి హృదయమున నయ్యది తక్క వేఱొండు కార్యము లేకుండెను. అద్దాని ఫలితముగ తమ శిష్యబృందము నకు అపూర్వ విషయములతో నొప్పు లలితారహస్య నామంబుల యందలి రహస్యంబుల నుపదేశించుచు అట్టి రహస్యములను ఇంకను అనేక విశేషవిషయంబులను సమకూర్చి విక్రమ శ్రావణశుద్ధ చతుర్దశి (16 8-40) నాఁడు కల్యాణ శ్రీకళయను పవిత్రతమమైన స్మృతిరాజమును లోకమునకు ననుగ్రహించిరి. యుగమాహాత్మ్యంబున ధర్మాధారములగు వైదికమార్గములకు హానికలుగునట్లు దేశము నందలి యుపాసనపద్ధతిలో దక్షిణాచారము క్షీణించి కౌళాచారము అభివృద్ధిఁ గాంచినది. ఇట్టి దుర్భరమగు వైదిక గ్లానిని నిర్మూలింపఁ దలఁచిన కార్యములలో ఈ స్మృతి రాజము ప్రధానతమమైనది.

కాని అద్దానివలన జిజ్ఞాసువులు అపూర్వములగు విషయములను దెలిసికొందురే కాని దానివలన తమ కర్తవ్యముగా నెంచిన దక్షిణాచార వ్యాపనము గల్గునాయని సం

దేహించి తమ యాచారవ్యాప్తికై తమ మంత్రదీక్షితు లలోఁ బ్రధానులగు పదునొకండుగురును ఛాత్రులను రావించి వారలకుఁ దగు నుపదేశ విధానమును, గొంతకాల ముప దేశించి ఆచార్యదీక్షను 16—10—40 తేదీనాఁడు ఒసఁగిరి.

ఇట్లు కుమత నిబర్హణముతో పాటు ధర్మసంస్థాపనం బునకై వలయు కార్యకలాపంబుల నెఱవేర్చి శ్రీ భారతీం ద్రులు భారతదేశమున ధర్మవ్యవస్థ చేసి తమ విద్యాశంకర సదనముననే ధ్యానయోగము గావింపనెంచి విక్రమ సంవ త్సరమునను వృషసంవత్సరమునఁ గొంతకాలము వఱకును బ్రతి మాసమునను దీక్షాపూర్వకంబుగ నాత్మోపాసనము గావించుచుండిరి.

ధర్మవ్యవస్థాపకుల కృత్యంబులలో నేదేని పరిశిష్టం బాయినచో ఆ పరాత్పరుఁడే అద్దాని కనుకూలంబులగు పరిస్థితుల నేర్పఱచి నివృత్తిమార్గంబుననున్న మహాభాగు లను మఱలఁ బ్రవృత్తి మార్గంబున అకార్య సమాప్తి ప్రవ ర్తింపఁ జేయుచుండుట పురాణ గాథలందు విదితమగు చున్నది. లేనిచో ఆ కొఱఁతవలన మఱల సదాచారసరణికి ముప్పు గల్గును. సర్వధర్మంబులకు నిదానంబగు కాలమును నిర్ణయింప సమకట్టిన పంచాంగంబులలో సరియగు క్రమము లేక నానాముఖములు బయల్వెడలినవి. దానిచే వైదికమార్గ తత్పరులు ధర్మాచరణమున మిక్కిలి చిక్కులను బొంను చుండిరి. కాలనిర్ణాయకంబులగు పంచాంగములు అతిశాస్త్రీయం బులగుటకు దేశమునందలి పరిస్థితులే హేతువులు. అందు వైదికమార్గమునకు అజన్మద్వేషులగు బౌద్ధాద్యవైదికమత ప్రవర్తకులు వైదికధర్మకార్యంబులకుఁ బ్రధానసాధనం బగు

కాలమును వైదికధర్మాననుగుణంబుగ నిర్ణయించి యద్దాని వ్యాపింపఁజేసినచో వైదికధర్మము తనకుఁ దానే క్షీణించునని తలంచిరి. కావుననే వైదికకాలనిర్ణయమునకు అనుపమసాధనముగా శిష్టస్మృతులచేఁ బరిగణింపఁబడిన సూర్యసిద్ధాన్తమును ద్రోసి తమ యుక్తివైభవముతో ఈ బౌద్ధాదులు కొన్ని సిద్ధాన్తములను లేవఁదీసిరి. నేఁడు మ్లేచ్ఛులవాతఁబడిన మనశాస్త్రములు వారుచెప్పిన క్రమముననే శ్రోత్రియసంతతులకుఁగూడ యెట్లు పరమపూజ్యులగుచున్నవో అట్లే ఆకాలమునఁ గూడ ఈబౌద్ధాది మతప్రవర్తకుల కడ విద్య నభ్యసించిన వైదికమార్గానుయాయుల సంతతిగూడఁ దమ గురు సంప్రదాయమునే ప్రవర్తింపఁ జేయుచుఁ బరమ ప్రమాణంబగు సూర్యసిద్ధాన్తమునకు విరుద్ధములగు గొన్ని గ్రంథములను రచియింపఁ దొడఁగిరి. అంత సర్వవిధముల మనధర్మములను మన నాగరకతను ఈర్ష్యాగ్రస్తతచే నశింపఁజేయ సమకట్టిన యవనులు పాశ్చాత్యులుగూడ మన భారతభూమికిఁబ్రభువులై మనవిజ్ఞానంబునకును మతమునకును గొప్ప హానిని గల్గించిరి. వానిలో ఈకాల నిర్ణయమొకటి. పాశ్చాత్యులు మనసూర్యసిద్ధాన్తముయొక్క సనాతనత్వమును అసాధారణ కాలనిర్ణాయకత్వమును సహింపనివారై చార్వాకులకుఁ బ్రధానమగు ప్రత్యక్షముసే ప్రధానమని యెంచుచు దృక్సిద్ధపద్ధతి యను నొకదానిని వ్యాపింపఁజేసిరి. కాలమహిమచే ద్రవ్యలోభము నొంది అర్వాచీన భారతీయపండితవర్గముగూడఁ బైపాశ్చాత్యసిద్ధాన్తమునే యంగీకరింపఁదొడఁగిరి. ఇట్టి విపరీత బుద్ధుల వలన వైదిక కర్మార్హమగు కాలమును నిర్ణయింప 'గ్రీన్ విచ్' అను యూరపు ఖండాంతర్గత పురమున వెలువడు

పత్రికయే కాలనిర్ణాయక ప్రమాణరత్నముగాను అద్దాని ప్రకాశకులు మహర్షులుగాను మనకు నేర్పడిరి. కావున ఇట్టి ధర్మసంకట సమయమున ఆ పరమేశ్వరి ప్రేరణముచే భారతీంద్రులు దృక్సిద్ధాన్త స్పష్టంబులగు పంచాంగములు సర్వవిధముల అప్రమాణంబు లగుటంజేసి హేయములనియు సూర్యసిద్ధాన్తానీతపంచాంగములే ప్రమాణంబులనియు నిర్ణయింప సమకట్టి యందులకు నేటి సంప్రదాయాను సారంబునఁ బరిషత్తు నొకదానిని వృషాశ్వయుజ శుక్లచతుర్థీ సౌమ్యవాసరమున శ్రీ మహామహోపాధ్యాయ తాతా సుబ్బారాయశాస్త్రిగారి యధ్యక్షతక్రింద నేర్పఱచిరి. దానిచే వైదికకర్మార్హమగు కాలవిషయమున ఒక రాజమార్గ మేర్పడెను. అంతఁ దొలుతఁ బ్రమాణ నిర్ణయవిచారమున అందలి గణకులందఱచేతను సూర్యసిద్ధాన్తమే పరమప్రమాణమని ఐకకంఠ్యముతో అంగీకరింపఁబడియె.

సభయందిట్లు సూర్యసిద్ధాన్తము పరమప్రమాణమని అంగీకరింపఁబడిన వెనుక సూర్యసిద్ధాన్తైక సమ్మతంబుగఁ బంచాంగమును సులభోపాయమున రచించుటను గణకలోకమునకు ఇతరానపేక్షితముగఁ దెల్పునట్టి పదక గ్రంథము నొకదాని రచించి తల్లక్ష్యభూతంబగు పంచాంగమును బీఠమునకు సమర్పింపఁగలవాఁ డెవ్వఁడని ఆలోచించుచుండ గుంటూరు మండలాంతర్గత వేమూరు నివాసులును భారద్వాజ గోత్రులును జ్యోతిశ్శాస్త్రపారంగతులునగు చిప్రుకుల వేంకటరమణశాస్త్రిగారు దాము స్వయముగ శ్రీవారి చరణసరోజములకడఁజేరి తాము అట్టి కార్యములను సర్వథా చేయఁగలవాఁడనని విన్నవించుకొనఁగా శ్రీవారును వల్లెయని యీ విష

యమును మఱుసటి దినమునఁ దమ విజయ పరిషత్తునందుఁ బ్రకటించిరి.

వేంకట రమణశాస్త్రిగారును వెంటనే సూర్యసిద్ధాన్తానుసారి పదక గ్రంథమును ఒకదానిని గల్యాణ గణితమను పేరఁ బ్రకటించుచు సూర్యసిద్ధాన్తసుదర్శన పంచాంగ మను పేరఁ జిత్రభాను వత్సరమునకు సూర్యసిద్ధాన్తానుసారముగఁ బంచాంగమును గుణించి పీఠమునకు సమర్పించుకొనిరి.

ఇట్లు సర్వవిధముల సర్వకర్తవ్యతాహాని నొందిన భారతీశ్రీచరణులకు ఇఁకఁ గర్తవ్యము లేదను నర్థమును సూచించుటకుఁ గాఁబోలు దక్షిణపాదముపై అధోభాగమునందు మహాకరాళంబగు వ్రణము లేచెను. దానిని గాంచిన శిష్యస్తోమమంతయు నిఁక శ్రీవారి యుపాధి తమ భాగధేయంబులపై ఆధారపడియుండినదని తలఁచి శ్రీవారి యారోగ్యసిద్ధికై సర్వదా జగన్మాత పూజలొనర్చియు ఆ పరమేశ్వరుని అభిషేకాదులచే సంతృప్తునిఁ గావించియుఁ బ్రత్యక్షముగఁ బరిస్థితులను గాంచుచున్న వారగుటచే మిగుల మానసికవ్యథ నొందుచుండిరి. తుదకు వృషవత్సర పుష్య శుద్ధ పౌర్ణమినాఁటికి వ్యాధి భయోత్పాదకంబులగు చిహ్నంబులతోఁ గన్పట్టెను. కాని భారతదేశమున కింకను భాగ్యోదయంబు చేకూర్పఁదగు ఋణము శ్రీవారికి ఉండుటచేఁ బుష్య బహుళ ప్రతిపన్నిశీథమునకు వారు మృత్యుంజయులైరి. అది మొదలు వారికి ఆరోగ్యము క్రమముగా చేకుఱ నారంభించెను. కొలఁది దినములలోనే సంపూర్ణముగ రుజ నివర్తించెను.

ఇట్లు మన భాగధేయములకొలఁది మన భారతీం
ద్రులు మనలకు సాహాయ్యమున మిత్రులై వాత్సల్యమున
జనకులై ధర్మశాసనములఁ బ్రభువులై బోధనంబుల
నొజ్జలై ఉపదేశంబుల నాచార్యులై అధర్మ వర్తనంబుల
విరోధులై క్రీడాదులఁ గ్రీడియై సార్వాత్మ్యభావము నొంది
గ్రహీతృభేదమునఁ దమ రూపనానాత్వమును బ్రకటించుచుఁ
బాత్రభేదమునఁ దమ యుపదేశామృతమును గ్రోలఁజేయుచు
భారతదేశమునందలి చాతుర్వర్ణ్యంబును దమ ధర్మరూపం
బగు క్రీఁగంటిచూపుతో నేలుచుండ శిష్యవర్గంబున ఇఁక
అశుభంబునకుఁ దా వెక్కడిది? ఈ కారణజన్ము లగు
శ్రీభారతీమూర్తుల యుపదేశగీతంబుల శ్రోత్రపేయంబులుగ
వినుచు వారి దివ్యరూపమును గాంచుచు వారి పాదసేవనము
సేయుచుఁ దరించుభాగ్యము మనబోఁటి భారతీయ శిష్య
కోటికి అనవరతము ఆ చిత్స్వరూపిణి యగు ప్రతాపభారతీ
పరాభట్టారిక అనుగ్రహించు గావుత!

---

శ్రీః

ధర్మసంస్థాపనముకొఱకై అవతరించిన శ్రీ భారతీంద్రులు తనువాఙ్ముఖములచే లోకమునకు ధర్మబోధసేయుచు అద్దానిని స్థిరీకరింపఁ దలఁచిరి. కావున భారతదేశమున సామాన్య వ్యవహారమును సర్వత్ర గనుచున్న సంస్కృతాంధ్రాంగ్లములయందు గ్రంథముల వ్రాసి ప్రకటించుచున్నారు. వీనియందు అనేక గ్రంథములు అపూర్వములగువిషయములతో నొప్పుచుఁ బ్రకృతకాలమున వైదికమార్గానువర్తులకును దదభిమానులకును ధర్మవిచారమునఁ గల్గు సందేహములనన్నిటిని సశాస్త్రీయముగను సయుక్తికముగను బాపఁజాలిన వైహిందూదేశమునందలి యాచారప్రాశస్త్యమును మతప్రాశస్త్యమును ఖండాంతర వాసులకు సైతము బోధింపఁ జాలినవగుచున్నవి. శ్రీవారు మ్లేచ్ఛభాషయగు నాంగ్లమునందుఁ గొన్ని గ్రంథములను వ్రాయుట కియ్యదిగూడ నొకకారణమై యొప్పుచున్నది. అట్టి యనర్ఘములగు గ్రంథరత్నముల నిటఁ బ్రదర్శించుచున్నాను.

## సంస్కృత గ్రంథములు

౧ పూర్ణమీమాంసాదర్శనమ్ (సవృత్తికమ్)
౨ బ్రహ్మసూత్రసంజీవనీ
౩ శారీరకమీమాంసాసంగ్రహః
౪ కల్యాణసంహితా
౫ కల్యాణస్మృతిః
౬ కల్యాణగీతా, రహస్యగీతా
౭ అక్షరదర్శనమ్
౮ ప్రాయశ్చిత్తపశునిర్ణయః
౯ ప్రమాణనిర్ణయః
౧౦ కల్పరత్నం (క)దర్శపూర్ణమాసౌ, (గ)అగ్నిహోత్రప్రశ్నః
౧౧ ఆపస్తంబీయ గృహ్యరత్నమ్
౧౨ మధ్వమతవిధ్వంసినీ (దశదూషణీ)
౧౩ అహంకారధ్వంసినీ
౧౪ మధ్వమతోన్మూలినీ
౧౫ సంధ్యాకలా

౧౬ తంత్రజ్యోత్స్నా
౧౭ కల్యాణీ (లలితాసహస్రనామ వ్యాఖ్యా)
౧౮ కల్యాణశ్రీకలా (లలితా రహస్యనామవ్యాఖ్యా)
౧౯ శ్రీ కలాదర్శనమ్
౨౦ శ్రీ విద్యాదర్శనమ్
౨౧ శ్రీ మాతృకాదర్శనమ్
౨౨ శ్రీ చక్రదర్శనమ్
౨౩ శ్రీ యోగసూత్రమ్
౨౪ కల్యాణశ్రీచక్రపరిలేఖనమ్
౨౫ మహారుద్రయాగత్రయమ్
౨౬ శ్రీ నిత్యకల్యాణమ్
౨౭ శ్రీ మాత్రర్చనమ్
౨౮ సర్వదేవ ప్రతిష్ఠావిధిః
౨౯ కామేశ్వరార్చనావిధిః
౩౦ సంతానగోపాలోపాసనావిధిః
౩౧ పార్థివలింగ పూజావిధిః
౩౨ శ్రీ రామతారకోపాసనావిధిః
౩౩ లఘు సూర్యనమస్కార విధిః
౩౪ సూర్యోపాసనావిధిః
౩౫ చండీ సప్తశతీపారాయణవిధిః
౩౬ రశ్మిమాలావిధిః
౩౭ సంన్యాసదీక్షావిధిః
౩౮ భారతీసంప్రదాయోపాసనా విధిః
౩౯ గణపత్యుపాసనావిధిః
౪౦ వనదుర్గోపాసనావిధిః
౪౧ విష్ణూపాసనావిధిః
౪౨ శూలినీదుర్గోపాసనావిధిః
౪౩ క్రియామయదీక్షావిధిః
౪౪ శ్రీయాగానుక్రమణికా (పూర్ణా, లఘుశ్చ)
౪౫ వాజసనేయస్మార్తనిత్యకర్మానుష్ఠానవిధిః
౪౬ తైత్తిరీయ సంధ్యాసూత్రమ్
౪౭ కాణ్వసంధ్యాసూత్రమ్
౪౮ ఉగ్రరథశాంతిః

## ఆంధ్రగ్రంథములు

౧ గీతామృతతరంగిణి
౨ కల్యాణసుధ
౩ వేదాన్తమీమాంసాశాస్త్ర హృదయము
౪ భగవద్గీతాతత్త్వనిర్ణయము
౫ గీతాహృదయము
౬ ఆత్మతత్త్వము
౭ శ్రుతిధర్మసంగ్రహము.
౮ వైదికధర్మచరిత్రము
౯ భారతవర్షీయధర్మసంగ్రహ చరితము
౧౦ ఆపస్తంబీయగృహ్యసూత్ర మీమాంస
౧౧ భారతీ సంప్రదాయము
౧౨ సంన్యాస సంప్రదాయములు
౧౩ మధ్వమతభంజనీ మాలికా
౧౪ మాలవీయ దుర్వాద నిర్వాపణము

౧౫ వర్ణవ్యవస్థ
౧౬ అపరోక్షానుభూతి టీకా తాత్పర్యములు
౧౭ ఆత్మబోధ
౧౮ అనుభూతి ప్రకాశిక
౧౯ అంతర్యామిబ్రాహ్మణము
౨౦ శ్రీకృష్ణకథాగాంభీర్యము
౨౧ శ్రీవిద్య
౨౨ కామకల
౨౩ వర్ణవ్యవస్థ
౨౪ మాతృభాష
౨౫ వర్ణాశ్రమధర్మము (మహోపదేశము)
౨౬ ఛాందోగ్యోపనిషత్తాత్పర్యము
౨౭ కేనోపనిషత్తాత్పర్యము
౨౮ వివాహధర్మము
౨౯ వైదికధర్మము
౩౦ సప్తర్షి మండలము-పూర్వఫల్గుని
౩౧ ప్రాయశ్చిత్త పశునిర్ణయము
౩౨ సూర్యసిద్ధాన్తమే సుదర్శనము

## ENGLISH

౧ Theosophy Unveiled
౨ At the feet of the Mahatma
౩ Theosophy and Truth
౪ Modern Ignorance
౫ Logical sequence of Euclid's Elements
౬ Purnamimamsa with Commentery
౭ Paramahamsa Sanyasin
౮ (Sreepeetham) Jagad gurupeetham
౭ Epochs of Bharata Varsha
౧౦ An introduction to the study of Sanskrit Literature
౧౧ Gitamritabindu
౧౨ Manavarahasyam
౧౩ Human variety
౧౪ An introduction to the study of Vedanta Darsna
౧౫ Secret Doctrine—Refuted
౧౬ Malaviya Durvada Nirvapana
౧౭ Message to the world (against the Theosophy)
౧౮ Sudarsanam
౧౯ Refutation of Jyotirganitam
౨౦ Hinduism is misnomer
౨౧ Axims of Human life

౨౨ Untouchability
౨౩ The values of $\pi$ (pi)
౨౪ Kamakala and Magic squares
౨౫ Indrasaraswati and Kamakoti declared Bogus
౨౬ The development of Races and nations (Mathematical Representation)
౨౭ Varnasrama Dharma
౨౮ Vaidika Dharma



శ్రీ జగద్గురువులు తమ యన్తేవాసిగణములను అనుగ్రహింప విశ్వరూపయాత్రకు వెడలి తమ బోధామృతముచే మధ్యరాష్ట్రప్రజలకు సకల శ్రేయములను ఒనగూర్ప నా సమయమున చాందానగరవాసులు భక్త్యతిశయముతో శ్రీవారి యంఘ్రిపద్మములకడ సమర్పించుకొనిన సమ్మాన పత్రిక:—

"శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య......... భూమండలాచార్యాద్యన్వర్థ బిరుదావళీ విరాజమాన శ్రీవిద్యాశంకర ప్రదమాఽవేశప్రకాశిత శృంగగిరి శ్రీవిరూపాక్ష శ్రీపీఠాధీశ్వర భారతీసంప్రదాయ సార్వభౌమ జగద్గురు శ్రీబోధానంద భారతీమాన్తాచార్య మహాస్వామి కరకమల సంజాత జగద్గురు శ్రీ కల్యాణానంద భారతీమాంతాచార్య మహాస్వామి మహారాజ చరణకమలేషు చంద్రపురనివాసిచ్ఛాత్రబృంద విహితాః కోటిశః ప్రణామాః విలసన్తుతరామ్ ।

శ్రీమత్పూజ్యపాదానా మిహాశుభాగమన మస్మాక మనేక జన్మోపార్జిత పుణ్యసంచయఫలమేవ దిష్ట్యాద్యపరిణామ త్యస్మదనుగ్రహార్థమితి భాత్యస్మతాన్వన్తేషు । శ్రీమత్పూజ్య

పాద దినకరోదయేన అతీవహర్షోత్ఫుల్లాని ఖల్వస్మన్మనః సరసిజాని। నమాతితరా మస్మద్ధృత్సు శ్రీమదాచార్యా ళ్యాగమజని ప్రమోదః। సర్వేవయం పూతాత్మానః కిల మన్యామహేఽస్మాక శ్రీమత్పాదాబ్జ రజోభిః।

శ్రీపాదా న కేవలం మూర్తిమన్తో గీర్వాణవిద్యావతారాః కిం తు రాజభాషాగహనమపి పారంగతా ఇతి సాక్షాత్కృతమేవ అస్మాభి రాచార్యపాదానా మస్ఖలితోభయ భాషావాక్ప్రవాహేణ అనేకాకర వేదాన్తగ్రంథరచనా కౌశలేన చ। పాశ్చాత్యప్రతిపాదిత 'థియాసఫీ' మతమాతంగ కేసరిణో వైదికధర్మ సంరక్షకా శ్చేత్యుపాధిద్వయ మపూర్వ తయాఽన్వర్థతాం గతం శ్రీమదాచార్యపాదేషు। శ్రీమచ్ఛంకర భగవత్పాద సంస్థాపిత శ్రీమదాచార్య విద్యాశంకర ప్రతిష్ఠాపిత శృంగగిరి విరూపాక్ష శ్రీపీఠం శ్రీమత్పూజ్య పాదైః సుష్ఠు విరాజతే సవిశేషమ్। శ్రీమద్వేదవిహిత సనాతన ధర్మస్య సాంప్రతికాసహాయ విషమపరిస్థితౌ తత్సంరక్షణోద్ధరణార్థం క్రియమాణాః శ్రీమదాచార్య పాదపరిశ్రమాః ప్రశస్యతరాః ఖలు సర్వథా సర్వత్ర కృతజ్ఞతామర్హన్తి సర్వేషాం సనాతన ధర్మాభిమానినామ్। శ్రీమదాచార్య పాదజ్ఞానోపదేశ రవిణా సకలమేవ విలయం గచ్ఛత్వస్మన్మోహాజ్ఞాన నిశాతమః। నిగమరహస్య బృహదుపనిషదభ్యాస పరిభావితాంతఃకరణ తుచ్ఛీ విహితాఖిలేంద్రియార్థ విభవానాం శ్రీమదాచార్యపాదానాం చంద్రపురస్థభూదేవ మానస నివాసి సందేహాస్పదోత్థననేన భవతు సువిఖ్యాత తరం పూర్వమేవోజ్జ్వలం యశో భగవచ్చంద్రమౌళిప్రసాదేన। మిథ్యాచారప్రస్ఫోటనేన సదాచార ప్రతిష్ఠాపనం కర్తుం

సర్వధా సమర్థా ఏవాచార్యపాదాః । కిం బహునోదితేన ॥ సర్వతోవయం నాలం పామరాః శ్రీమదాచార్య పూజ్య పాదానాం అనేక గుణగణగానాయ ॥ అతశ్చ శ్రీమ దాచార్య పాదదర్శనోపదేశామృత ప్రసాదేన అపరిమిత మనుగృహీతావయం భూయోభూయః కోటిశః సాష్టాంగప్రణ తిభిః సాదరం సువినీతం చాభివాదయామహే ఆచార్యపాద శుభాశిషశ్చాభ్యర్థయామహే ॥

చంద్రపురం,
పౌష శుక్ల ౫,
శకాబ్దాః ౧౮౫౧.

ఆచార్య పాదప్రణతాః
చంద్రపురనివాసిచ్ఛాత్రబృందాః.

ఏలూరు జనార్దన ప్రార్థనా సమాజ ద్వితీయ వార్షికో త్సవ సందర్భమున అధ్యక్షపీఠము నలంకరించిన శ్రీజగద్గురు వుల ఉపదేశపీయూషమును గ్రోలి శ్రీచరణసన్నిధిని సమా జమువారు సమర్పించుకొనిన స్వాగతపత్రిక.

"జయంత్యద్వైత వేదాన్త సిద్ధాన్తోద్బోధశాలినః ।
శ్రీవిరూపాక్షపీఠేశ కల్యాణానన్దయోగినః"

భవదాగమనాత్సతాం మనః కుముదాన్యద్య సమాగమాది
వేందోః ।
వికసన్త్యమలాని దీపయత్వం సుచిరంబోధ సుధాభిషేచనేన॥
భక్త్యాసమర్పయామః స్వాగతసత్కార పత్రికామేతామ్ ।
అద్వైత తత్త్వ గురవే కల్యాణానన్దభారతీయమినే॥
పాపము రూపుమాపి కలిభారము వారణసేయు షణ్మత
స్థాపనఁజేసినట్టి గురుశంకరు దివ్యపదార విందముల్ ।
ప్రాపుగ శిష్య సంతతి కపార కృపాపరతంత్రవృత్తిఁ జి
ద్రూపముఁజూపుసద్గురువరుల్ దయసేయుటభాగ్యమౌఁగదా॥

వైదికపద్ధతింగడఁగి బ్రహ్మము కర్మముపాస్తిసేత యం
దాదరమేదుటం బరమతాభినివేశనిబద్ధమై వినా
శోదయలక్ష్మలం గుములుచున్నది పున్నెపుఁ గర్మభూమి త
ద్వేదనమున్ భవాదృశులెతీర్పవలెంగద సద్గురూత్తమా॥

వర్ణవ్యవస్థ దుర్భరవివాదా నర్థ
కారణంబనుచు నొక్కరుఁడువలుకు,
విగ్రహారాధన వితథకృత్యంబని
వెకవెక నొకవెఱ్ఱి వెక్కిరించు
కర్మకాండము విప్రగణ కల్పితము కాని
ఫలము లేదనియొక్క భ్రాన్తుఁడనును,
ఆశ్రమాచారంబులజ్ఞానకృత్యంబు
లని యొక్క విజ్ఞాని యాగ్రహించు
భక్తియడుగంటె బాహ్యదంభంబు పెఱిఁగె
నీతి మటుమాయమయ్యె దుర్ణీతి హెచ్చె
కటకటా యిట్టి కలికాల కలుషమడఁచు
సరణి చూపఁగదయ్య యాచార్యవర్య"

స్నాన సంధ్యాద్యనుష్ఠాన సమితియేల
పూజలేల జపంబేల పూజ్యులమను
శుష్క వేదాన్త మేవంకఁ జొచ్చివిరిసె
సదమదమొనర్పుదాని నాచార్యవర్య !"

ప్రతివాది మత్తవారణ కేసరీంద్రంబు
శ్రౌతక్రియా ధర్మసార సరణి
నిరతాశ్రితానీక నిర్జరభూజంబు
చటులోగ్ర సంసారజలధితరణి

ప్రాచ్య పాశ్చాత్య ప్రపంచభాషావేది
సర్వమతోక్త సుజ్ఞానపేటి
అనుపమాద్వైత సిద్ధాన్తాలవాలంబు
వైదికమార్గ ప్రవర్తకంబు
నవనవానంద కల్యాణనామకంబు
సర్వతంత్ర స్వతంత్రంబు సత్వదంబు
శ్రీవిద్యాపాఠపీఠాధిసేవితంబు
నైన బ్రహ్మంబు జయమొందు నహరహంబు॥

త్రికరణంబులన సమభక్తియుఁ బ్రపత్తి
దనర శ్రీజనార్దనుని ప్రార్థనసమాజ
మర్పణం బొనరించె నీస్వాగతంబు
శ్రీమదద్వైత సద్గురు స్వామికిట్లు॥

ఏలూరు,
15—11—32.

ఇట్లు,
శ్రీ జనార్దన ప్రార్థన సమాజము

---

వ్యాఖ్యాన సింహాసనాధీశ్వరులు గర్తపురమున తమ సన్నిధిని ఛాత్రబృందమునకు అఖండముగ ప్రస్థానత్రయ ప్రవచనము చేయుఁగాఁ దుదిని ఆశిష్యగణము భక్తిపారవశ్యమున సింహాసన సన్నిధి సమర్పించుకొనిన విజ్ఞాపనాపత్రిక,

"అయిపూజ్యపాదాః,

అనుగృహ్యాతాం శ్రీమద్గర్తపురీపౌరజనైర్వైదికధర్మానుయాయిభిస్సవినయం సంపాదితేయం విజ్ఞాపనపత్రికా—

వైదికమార్గప్రవర్తక సర్వతంత్ర స్వతంత్ర శ్రీమద్విద్యారణ్యస్వామిపాదైర్విద్యానగర రాజధానీ కర్ణాటక

సింహాసనమాస్థాపితాఽఽధ్యాత్మికరాజ్యలక్ష్మీః సకలరాజన్య సమ్మానితాపి కరాళకాలకబలితా సమ్మూర్ఛితేవ కతిపయ కాల మకల్పయ దుత్కంఠతాం నిజభక్తజనహృత్సీమాసు। అచిరమేవసా శ్రీబోధానందభారతీ మాన్యాచార్య స్వామి పాదైరతి కృపాళుభిస్సాదరముద్ధృతా శ్రీచరణ కరకమల సమర్పితా త్రయీమయీ వాగ్విలసిత సారస్వతామృతేన సంజీవితా పునరపి తారుణ్య మాపద్య దిగంత విశ్రాంత మాతనోతి కిమపి నూతనశోభావిశేషమ్॥

సంతత మానంద సంధాయినీ చాద్య సమారాధ్యతే, అనన్యసాధారణ మనల్పమాద్వైతికీన మనవద్యమద్యప్రతిభా వైశారద్యమార్యపాదానాశ్రిత్య చరితార్థతాం గమిత మియ తాకాలే నేత్యత్యంతం మోదామహే, కించాశాస్మహే నిరూఢస్థితిస్సా సర్వస్య స్వాన్మఖ్యమచిరేణైవసంపాద్య సుస్థిరా భవిష్యతీతి।

శ్రీవిద్యాశంకరాధిష్ఠితాం భారతీసంప్రదాయ పరం పరాగతాం వ్యాఖ్యాన సింహాసనాధీశ్వరతా మనవద్యామ ద్యాలంకుర్వాణానాం బ్రహ్మ విద్యాప్రవచన ప్రవీణానాం భవతాం భారతీ సువ్యాఖ్యాతవతీ విరాజతే ప్రస్థానత్రయోప బృంహితాన్ సర్వానౌపనిషదాన్ ధర్మానిత్యత్యంత మను గృహీతోఽన్తేవాసిలోకః

సూక్తిసహస్రద్యోతితాత్మనామత్రభవతాముద్యత్సూ ర్యప్రభాభాసురాభిః సర్వతోముఖశేముషీ విలసత్సు యుక్తి రత్నప్రభాభి రన్తరాళ నిగూఢమచిరంతనం సాంద్రం ద్వైతం తమః క్వాప్యభిద్రావితమ్। అణీయసీభిశ్చిరంతన బుద్ధిభిరున్మీలిత పూర్వమప్యఖండతయా తత్త్వమ ప్రతి

పాద్య ముపపాదిత వద్భిర్వింశతి సంఖ్యాకై రుపన్యాసైర్మహో పన్యాసః పరావరే సమ్యక్కృత ఇతికిం నోపకృత మార్య పాదైః। న కిమపిభవతామాస్తేఽత్ర ఫలాభిసంధిర్లోక కల్యాణ మంతరా। "లోకవత్తు లీలాకైవల్య" మితిబాదరాయణ సూక్తిరేవాభివ్యనక్తి భవాదృశామాచారమ్.

వయమప్యద్య భావత్క పదాబ్జ ప్రవణతామాపా దయితు మహైతుకీ మవ్యాజామనన్యాం భక్తింసమాశ్రితాః నతుశక్తాస్తావకీన గుణగణాఖ్యాన విధిషు.

శ్రీమజ్జగద్గురో! అంతస్తోషవ్యతికరవశా దాఖ్యేయ మాఖ్యాతు మపర్యాప్తేయమస్మాకీవాణీ, కుంఠితగమనా స్వైరం స్వైరం సంలపన్తీ వినేయతామాలంబతే॥

కల్యాణైకరసా కళాపరిచితిస్వానంద సంపత్ప్రదా
స్వచ్ఛస్ఫాటికకాయకాన్తి విలసచ్ఛైలాత్మజా ప్రాభవా।
త్రయ్యన్తప్రతిపాద్య తత్త్వనిరతా బోధైకలభ్యాఽనిశం,
ద్వైతధ్వంస విశుద్ధచిత్తఫలకే బాభాతువో భారతీ"

ఇత్థం విజ్ఞాపయితారః
వైదికధర్మానుయాయినో
గర్తపురీ పౌరజనాః

గుంటూరు,
5—2—35.

---

పై సందర్భముననే గర్తపురీపౌరులచే నలంకరింపఁ జేయఁబడిన రత్నపంచకము—

శ్రీరాజితుం డాదినారాయణపదము్మ
నందు సంభూతి భాగ్యంబునొంది

సర్వజ్ఞ శంకరాచార్య మాళ్యవలంబ
మున సర్వతోముఖా భోగమంది
ప్రీతి విద్యారణ్య శ్రీధర పూజ్యపా
ద స్థాపితంబయి సుస్థితిగని
అద్వితీయులగు బోధానంద సుభగిర
ధోక్తి విశేషమందొదిగి మెదిగి
ఆత్మవిద్యామృత ప్రవాహంబు నేఁడు
భరతఖండమందు త్వదీయ భవ్య పావ
నాజ్ఞలను వెల్లువలుగట్టునట్టిదయ్యె
శృంగగిరి విరూపాక్ష పీఠాంగదేవ ॥

వైదికధర్మ సస్యోదయమ్మునకు శ్రా
వణ వార్షుకాభ్ర వైభవములుండు
ద్వైతకాంతార సంతానమ్ము భవ్యసా
త్కృతిసేయు దావాగ్ని కీలలుండు
వాది యుల్లంబులోపల భల్లునందూరి
వేఁటాడు బల్లెంబు పోటులుండు
జిజ్ఞాసుజనముల చేతులఁ గమ్మని
యనఁటిపండొలిచి పెట్టినటులుండు
కరుణతోడ బోధానంద గురులొసఁగిన
యట్టి వ్యాఖ్యాన సింహాసనాధిరూఢు
లై తెలుపుచుండఁ దాము శ్రుత్యర్థములను
శృంగగిరి విరూపాక్ష పీఠాంగదేవ.

నేఁడుగా యద్వైతనిర్మలమతము స్వీ
య యశంబు నింపె దిగంతములను

నేఁడుగా డాఁగియుండిన తత్త్వము ప్రసిద్ధ
మయ్యె వింశత్యుపన్యాసములను
నేఁడుగా తావక కాన్తేవాసిహృదయ సం
భవసంశయము పటాపంచలయ్యె
నేఁడుగా అభివృద్ధినింబొందె మా శ్రీ జ
గద్గురు పీఠికాగౌరవంబు .

తాము లోకకల్యాణార్థమై మెలంగ
భారతీసంప్రదాయ సర్వస్వతంత్ర
పరమహంస బోధానందగురుయతీంద్ర
శిష్యవర్య కల్యాణవిశిష్టనామ.

తమపైని మాకుఁ గల యు
త్తమభక్తిం దెల్పఁ గడఁగెదముగాక గురూ
త్తమ భవదీయ సుగుణవా
రము లెక్కింబెట్ట మా తరంబది యగునే.

పరమంబౌ ధిషణ ప్రభావగరిమన్ భాష్యత్రయంబున్ సుధీ
స్ఫురణంబొప్పఁ బఠింపఁ జేసితిరి మున్ శోధించి యున్నాళ్ళు దు
ర్భరదీక్షన్ బరకీయదుర్మతము ద్రుంపంజాలినారౌర యే
కరణిన్ మీ ఋణమీఁగ నేర్తుమునమస్కారంబునంగాకికన్.

గుంటూరు, 5—2—35.

ఇట్లు విన్నవించు వైదికధర్మానుయాయులు
గర్తపురీపౌరులు.

అద్వైత ప్రతిష్ఠాపనాచార్యులగు మన జగద్గురుస్వాములు ద్వైత ద్విప పంచాననులై గర్జనములు సేయ నవ్వాని విని ద్వైతద్విపము దిక్కోణములఁబట్టి సాగినది. పత్రికాముఖములందు అవ్వానిని గని బళ్లారి యశేషస్మార్తమండలి వారు సత్యధ్యానతీర్థ ప్రకటితా సత్యహేతుజాలమునుండి తమ్ము రక్షింప శ్రీవారిని రా వేఁడి యట రక్షింపఁబడి అద్వైతప్రబోధక సంఘముపరముగ సమర్పించుకొనిన ధన్యవాదములు—

"శ్రీ గురుసార్వభౌమా,

శిష్యజనోద్ధరణదీక్షాపరులై శ్రీ శాంకర దివ్యపీఠము నలంకరించియుండు తేజోమూర్తులరగు తమ సందర్శన భాగ్యము మాకు నేఁటి కబ్బినందులకుఁ గలిగిన యానంద మిట్టిదని విన్నవింపఁజాలకున్నారము. శాంతగంభీరమగు తమ వాక్సుధాస్వాదనమునకై చకోరములకైవడి వేఁచియుండు మేము నేటికిఁగదా కృతార్థులమైతిమి.

కుమతకుంజర కేసరీ,

మాధ్వపీఠాధిపతులగు ఉత్తరాదిస్వాములవారు వచ్చి వేదాన్తవిచారణను సివిలుకోర్టుపాలుచేసి శ్రీశాంకర సిద్ధాన్తము నద్వైత సంప్రదాయమునకు విరుద్ధములగు వ్యాఖ్యానములచే సమస్తాస్తిక మహాజనుల మానసముల కలఁతఁ జెందించు నిట్టి సమయమున మాప్రార్థనమేరకుఁ దాము విజయముచేసి యమోఘములైన మహోపన్యాసములచే మమ్ముల నానందింపఁజేసిన తమకివే యనంత ధన్యవాదములు.

యతిశేఖరా,

పరమ దయామూర్తులరగు తాము మతత్రయ సిద్ధాన్తములను శిష్యులకుఁ గరతలామలకముగ బ్రవచనము చేయుచుండుటయే తమ దృష్టిని వెల్లడిచేయుచున్నది. అనాద్యవిచ్ఛిన్న గురుపరంపరాప్రాప్తమై సకల వేదాన్త సమ్మతమగు శ్రీ శాంకరాద్వైత సిద్ధాన్తమే ప్రపంచములో పరమ సిద్ధాన్తమని తా మొనర్చు బహిరంగ ప్రతిజ్ఞయే భవదద్వైతస్థాపనాచార్యత్వమును లోకమున నిరంకుశముగఁ జాటుచున్నది. మతాంతరులకుఁ బ్రమాణములని యెన్నఁబడు వానినుండియే అద్వైతసిద్ధాన్తమును సమర్థించుటయే తమ యసాధారణ ప్రతిభా పాండిత్యముల వేనోళ్ళఁ బ్రకటించు చున్నది.

బ్రహ్మవిద్వరిష్ఠా,

తాము పొడచూపినంతనే కల్యాణమును, తమ యుపదేశ సారముల నాకర్ణించినంతనే యానందమును, భవత్సాన్నిధ్యమాత్రముననే భారతీ ప్రసాదమును, శిష్యసంతతి కొదవుటంజేసి యుష్మ ద్దివ్యనామము ప్రత్యక్షరమును, సార్థకమై విరాజిల్లుచున్నది. వెండియు బహుదినములుగ అజ్ఞాన ధ్వాంత వాతావరణముచే మైమఱచి తద్దయు మోహానిద్రఁ జెందియుండు మమ్ములఁ బ్రబోధించుటకై తామే తెంచుటచే మా యీ యద్వైతి ప్రబోధక సంఘముగూడ అన్వర్థాభిధమయ్యె నని విన్నవించుటకు సంతసించుచున్నారము.

కావున ఓ శిష్యానుగ్రహ పరాయణా,

మాప్రార్థనములపై ఇచటికి విచ్చేసి మహోపదేశముచే మమ్మనుగ్రహించి నిరతిశయోపకారమును గావించిన

మీకు అనురూపమగు భక్తిని వెల్లడిసేయుటయేకాక "పత్రం, పుష్పం, ఫలం," అను భగవదుక్తి ననుసరించి ఈ యభినందన విజ్ఞప్తి పత్రపుటాచ్ఛాదితమగు పుష్పఫలాంజలి నిదే సమర్పించుచున్నారము.

మాకు శాస్త్రగురుదేవతలయందు దృఢభక్తి విశ్వాసమును ఇతోఽధికమగు శ్రేయః ప్రాప్తిని గల్గించునట్లు తమనారాయణ స్మృతిని సర్వదా అభిలషించు;

| | |
|---|---|
| బళ్లారి,<br>యువచైత్ర కృ. ౧౦<br>28—4—35. | యుష్మదత్యన్తప్రియాన్తేవాసులు,<br>బళ్లారి అశేషస్మార్తమండలివారు. |

---

ఆదవానియందుఁగూడ ద్వైతమతాచార్య క్షోభనణఁచిన వెనుక ఆపురమునఁగల అద్వైతప్రబోధకసంఘమువారు శ్రీవారికి అభినందనపత్రిక నొకదానిని ఆదవానిపురము ననే సమర్పించుకొనిరి.

" జగద్గురూ,

తామిదే వత్సరమున బళ్లారికి విచ్చేసియుండియు తమ దర్శనభాగ్యము మాకు లభింపకపోయెనని కొఱఁతపడు మాయందు పరిపూర్ణానుగ్రహముంచి మాప్రార్థనమేరకు మాపురమునకు దిగ్విజయముసేసి మమ్ముల సంతుష్టాన్తరంగులఁ గావించినందులకై తమ కివే వందనసహస్రంబుల నర్పించు చున్నారము.

యతిశేఖరా !

శిష్యజనోద్ధరణమునకై చిరకాలమునుండి చేయు స్వధర్మ ప్రచారణతో పాటు తాము ప్రకృతము స్వమత ప్రచారణమునకుఁ గడఁగి పరమపూజ్యమగు శ్రీశాంకరాద్వైతసిద్ధాన్తము కలుషితమొనర్చునట్టి మతాంతరుల దుష్ప్రచారము రూపుమాపి వైదికమతరాజమును నిష్కంటకముగఁ జేయుచుండు మిమ్ములను జూడ ఆ గురుసార్వభౌముఁడగు శ్రీవిద్యారణ్యస్వామీంద్రుఁడు మాకు జ్ఞప్తికివచ్చుచున్నాడనుట కెంతయు సంతసించుచున్నాము.

ప్రాజ్ఞవరేణ్యా,

తమ వాగ్ధోరణి గంగాస్రవంతివలె అప్రతిహతము. బోధకతాశక్తి అసాధారణము. విషయవివేచనాపటిమ మతినిపుణము. దుర్మతఖండనప్రకారము అఖండము. సర్వశాస్త్రసమన్వయశక్తి యత్యద్భుతము. ఇంతయేల? తమ వివిధ విద్యావిమర్శనప్రతిభ భారతీయులనే గాక ఖండాంతర వాసులనుగూడ తలలూపునట్లొనర్చుచున్నదనుట ఎంతమాత్రము నతిశయోక్తి గానేరదు.

ద్వైతధ్వాంతచండభాస్కరా,

తాము అనాది వైదికసంప్రదాయసిద్ధమై, ప్రస్థానత్రయ సిద్ధమగు శ్రీశాంకరాద్వైత సిద్ధాన్తముపై మతాంతరులచేఁ జేయఁబడిన యాక్షేపముల నధిక్షేపించి ద్వైతివాదములకు అచట నించుకేనియు నవకాశము లేకుండఁజేసి మా సంశయములఁ బోఁగొట్టి ఈప్రాంతమున ఉత్తరాది మాధ్వపీఠస్థుల సంచారమువల్ల ఏర్పడిన మతక్షోభ నణఁగఁద్రొక్కి

శ్రీ విరూపాక్షేశ్వరో విజయతే

భో భగవచ్ఛంకరపాదాః,

అపి నామ స్వాగత మాచార్యపాదానాం, అనన్య జనసామాన్య సహృదయ మాన్యప్రతిభావిశేష పరాజిత పరాశయానా మపి చ మహాశయానాం, అనవరతారాధిత లలితాలలితాకటాక్ష విక్షేపాసాదిత నిరవశేష నిగమాంత విశేషాణాం, సకృదాకర్ణనావలోకనమాత్ర సంపాదిత శిక్షా ప్రముఖ సకల శాస్త్రలక్షణానా మపి విలక్షణానాం, శ్రీసదన నివాసానురాగాణా మపి విరాగాణాం, విమత జన మద ఖండనోత్సాహ విధివదధీత వివిధవిద్యా నవద్య విద్వజ్జన మండిత సభామండపావలోకన సమయ సముద్గత సరస మృదు మధురోపన్యాసోదాహృత వివిధోపనిషదర్థ విశదీకరణ విశీర్ణ మృషావాద ముఖరాంతఃకరణానాం, ఆశ్రిత జనైక శరణ శ్రీచరణానాం, అతీత వర్ణాశ్రమాణా మపి వర్ణాశ్రమరక్షణకృత పరిశ్రమాణాం శ్రీయుత శృంగేరీ శ్రీ విరూపాక్ష శ్రీపీఠ మలంకుర్వాణానాం, శ్రీమద్విద్యాశంకర పదమావేశప్రకాశిత జగద్గురు శ్రీకల్యాణానంద భారతీ మాంతాచార్య గురువర్యాణాం ఆగమనేన పవిత్రీకృతేయం శ్రీ వేదవిజ్ఞానవర్ధనీ పరిషత్। "యతో వాచో నివర్తన్తే అప్రాప్యమనసా సహే"తి చిరకాలసమాగతాం అవప్రథాం అపహరతీవ వేదానాం। ప్రాయశస్తావదేతాదృశ్యః పరిషదః పరితోపినైవ దరీదృశ్యన్తే తదనుగుణాధిపత్యవలంబాభావాత్। తతః తత్రభవత్పూజ్యపాదాః సనాతనవర్ణాశ్రమ ధర్మ సదాచార ప్రవర్తన ప్రసక్త దివ్యచిత్తాః యదిశరణం

న వేయుం నేతత్ప్రసాదః శ్రీమతీ పరిషదియమపి సనాధ్యాసతీ సనాతనేతర సంప్రదాయ ప్రవృత్తిం స్వస్వేతర సంఘర్షాంశ శీలన సదాచార ప్రవృత్తిం సామగ్ర్యేనచ సంభావయతీతి పున ను ముఖ్యగతం భగవత్ఖండమితి అస్మదాశయః ।

ఏవం వేదవిద్యాసంస్థాన పరిషత్ప్రతినిధయః

1. కానుకుర్తి వేంకటకృష్ణారావు (ప్రెసిడెంటు)
2. ఆకెళ్ళ సత్యనారాయణరావు (వైస్ ప్రెసిడెంటు)
3. కేసరి కామేశ్వరరావు (సెక్రెటరీ)
4. మహామహోపాధ్యాయ తాతా సుబ్బారాయశాస్త్రి
5. వేదుల లక్ష్మీనారాయణశాస్త్రి
6. ఓ. కామేశ్వరశర్మ.

విజయనగరము, 30–8–1937.

ఓం తత్సత్.

లక్ష్మీ పవర్ ప్రెస్, తెనాలి.